# శ్రీ మదాంధ్ర

# పద్మపురాణము

(పాతాళఖండము)

ద్వితీయసంపుటము

శ్రీమద్వేంకటగిరిమహారాజాస్థానమహావిద్వా౯
కావ్యకళానిధి ఆశుకవికేసరి విద్యాభూషణ శతావధాని
పిసుపాటి చిదంబరశాస్త్రి ప్రణీతము

ప్రకాశకుఁడు
విద్వా౯, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి
ఆంధ్రాధ్యాపకుఁడు
వేంకటగిరిరాజకళాశాల, నెల్లూరు.

1955

శ్రీమదాంధ్రపద్మపురాణము

ప్రథమసంపుటము

క్యాలికోబైండు ............8-0-0

అట్టబైండు ...............7-0-0

ద్వితీయసంపుటము

క్యాలికోబైండు ............4-0-0

అట్టబైండు ...............3-0-0

నాలుగుసంపుటములు....25-0-0

పుస్తకములు దొరకుచోటు

విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

ఆంధ్రాధ్యాపకుఁడు

వేంకటగిరిరాజకళాశాల, నెల్లూరు

ముద్రాపకులు

ప్రభాత ప్రెస్సు - నెల్లూరు.



శ్రీమాత్రే నమః

# విజ్ఞాపనము

శ్రీమదాంధ్రపద్మపురాణద్వితీయసంపుటము కృతిభర్త యగుశ్రీకాశీవిశ్వేశ్వర శ్రీమన్మహాదేవునికరుణావిశేషంబుననను, గృతికర్త యగుశ్రీచిదంబరకవీంద్రునిసంకల్ప బలంబుననను ముద్రితమై యాంధ్రమహోదయులదృష్టిపథము నలంకరింపఁగలిగినది.

ఇందు శ్రీమదాంధ్రపద్మపురాణచతుర్థఖండ మగుపాతాళఖండము మాత్రము కలదు. ఈసంపుటము ప్రథమసంపుటముకంటెఁ బరిమాణమునందుఁ జిన్నదైనను విశిష్టవిషయప్రతిపాదనమందు మిన్నయై యున్నది.

ఇందు "రామాశ్వమేధగాథ" విపులముగా వర్ణింపఁబడినది. మఱియు "రాధాకృష్ణతత్త్వము" "శివమహిమము" "భస్మోత్పత్తిమహిమములు" "శివపూజావిధానము" "సీతాపరిత్యాగప్రధానహేతువు" మున్నగు ననేకవిషయము లుపాఖ్యానములతో వివరింపఁబడియున్నవి. ఇందలివిషయములం దెల్ల నపూర్వవిషయము "పూర్వకల్ప రామాయణగాథ". ఇది పురాణేతిహాసములు పరస్పరవిరుద్ధవిషయప్రతిపాదకము లని వివదించువారికి భగవానుఁడు వేదవ్యాసమహర్షి యొసఁగినయప్రతిహతసమాధానము.

ఏతాదృశానేకాపూర్వవిషయబోధకములు నార్షజ్ఞానవిజ్ఞానమూలకందములు నగుపురాణముల నెల్ల నాంధ్రమహాజను లామూలాగ్రముగాఁ జదివి సకలసంశయనివృత్తిం బడసి శ్రేయోమార్గము నధిగమింతురుగాక యని యాసించుచున్నాఁడను.

ద్వితీయసంపుటముద్రణమునకు సైతము శ్రీవేంకటగిరిరాజకళాశాలావిద్యార్థు లుదారభావముతో రెండువందలయెనుబదినాలుగురూప్యము లొసఁగియున్నారు. భాషాభిమానమానితహృదయులు మార్గదర్శకులు నగునీవిద్యార్థులకుఁ గృతిపతి సకలశ్రేయఃప్రదాత యగుఁగాక యని యాశీర్వదించుచున్నాఁడను.

మఱియు విద్యార్థులలోఁ గొందఱు ప్రోత్సాహకులుగాఁ బేరి రు. 25-0-0 చొప్పున ద్రవ్యము నొసఁగి చేయూఁతయిచ్చియున్నారు. మఱికొందఱు ప్రథమసంపుటమును గొని సాయపడియున్నారు.

శ్రీమదాంధ్రపద్మపురాణముద్రణమునకుఁ దోడ్పడినదాతలనామధేయము లనుబంధమున ముద్రింపఁబడియున్నవి.

ఆంధ్రమహోదయు లీసత్కార్యమునకు విశేషముగా సహాయపడి యచిరకాలముననే తక్కినసంపుటములను సైతము ప్రకటించుటకుఁ దగినయవకాశమును గల్పింతురుగాక యని యభ్యర్థించుచున్నాఁడను.

ఇట్లు

విన్నవించుభాషాసేవకుఁడు

పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

ఆంధ్రాధ్యాపకుఁడు, వేంకటగిరిరాజకళాశాల.

నెల్లూరు
1-1-1955

# అనుబంధము

## శ్రీమదాంధ్రపద్మపురాణముద్రణమునకుఁ దోడ్పడినదాతలనామధేయాదికము

### మహారాజపోషకులు

| | మొత్తము |
|---|---|
| శ్రీ వేంకటగిరిరాజకళాశాలావిద్యార్థులు, నెల్లూరు. (Inter & B. A. 1952 & 1953) | 1116-0-0 |
| ,, ,, (Inter & B. Sc. 1954) | 284-0-0 |

### రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ మాముడూరి శివరామయ్యపంతులుగారు, B. A., B. L. నెల్లూరు. | 250-0-0 |
| శ్రీ ఇంగువ శ్రీకృష్ణయ్యపంతులుగారు, B. A., B. L. నెల్లూరు. | ,, |
| శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు, నెల్లూరు. | ,, |

### పోషకులు

| | |
|---|---|
| శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, నెల్లూరు. అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి. | 100-0-0 |
| శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు, Proprietor, Venkatrama & Co., Eluru | ,, |
| శ్రీ పిసుపాటి సుబ్బరామయ్యగారు, కరవది. | ,, |
| శ్రీ వంక లక్ష్మీనారాయణగారు, నెల్లూరు. | ,, |
| శ్రీ ములుమూడి లక్ష్మీనరసింహముగారు, నెల్లూరు. | ,, |
| శ్రీ M. శ్రీవేణుగోపాల్‌గారు, B. Sc. వేంకటగిరి. | ,, |
| శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు, Proprietor, Vavilla Press, Madras. | ,, |

### సహాయులు

| | |
|---|---|
| శ్రీ పిసుపాటి వేంకటరాఘవయ్యగారు, M. P. కరవది. | 50-0-0 |
| శ్రీ పంచాగ్నుల యజ్ఞేశ్వరయ్యగారు, నెల్లూరు. | ,, |
| శ్రీమతి భాస్కర విశాలాక్షమ్మగారు, వేంకటగిరి. | ,, |
| శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు, ముక్తేశ్వరము. | ,, |
| శ్రీ పైడా వెంకటనరసయ్యశ్రేష్ఠిగారు, పిఠాపురము. | ,, |
| శ్రీ నాయని నరసింహారావునాయఁడుగారు, B. A., B. L. ఒంగోలు. | ,, |
| ఉపాధ్యాయబృందము, Taluk High School, Tenali. | ,, |

# ప్రోత్సాహకులు

ఆంధ్రకేసరి గ్రంథాలయము, నందూరు. 25-0-0
(శ్రీ) జటావల్లభుల పురుషోత్తముగారు, M. A. విజయవాడ. ,,
(శ్రీ) చిప్పకుల కృష్ణయ్యగారు, B. A., L. T. విజయవాడ. ,,
(శ్రీ) ముష్టి విజయభాస్కరసుబ్రహ్మణ్యకుమార్ గారు, చెన్నపురి. ,,
(శ్రీ) నోరి రామశాస్త్రిగారు, విజయవాడ. ,,
(శ్రీ) దివాకరుని లక్ష్మీనారాయణగారు, B. A., B. L. గుంటూరు. ,,
(శ్రీ) ముళ్లపూడి తిమ్మరాజుగారు, తణుకు. ,,
(శ్రీ) మంత్రిరావు సత్యనారాయణరావుగారు, M. A., LL. B. తణుకు. ,,
(శ్రీ) కొండముది శ్రీరాములుగారు, B. A., B. L. తెనాలి. ,,
(శ్రీ) కూచిభొట్ల సూర్యనారాయణగారు, B. A. తెనాలి. ,,
(శ్రీ) పిశిపాటి సత్యనారాయణగారు, రేపల్లె. ,,
(శ్రీ) విద్వాన్, దర్భా వేంకటకృష్ణమూర్తిగారు, M A. నెల్లూరు. ,,
(శ్రీ) ధరణికోట వేంకటసుబ్బయ్యగారు, M. A., BED. నెల్లూరు. ,,
(శ్రీ) పోలూరి హనుమజ్జానకీరామశర్మగారు, B. A. (Hons) నెల్లూరు. ,,
(శ్రీ) M. S. రాఘవన్ గారు, M. A. నెల్లూరు. ,,
(శ్రీ) కాసుఖేల రామారావుగారు, B. A., B. L నెల్లూరు. ,,
(శ్రీ) రెట్టిగంటి విశ్వేశ్వరరావుగారు, చిలుతపూడి. ,,
(శ్రీ) రాళ్లపల్లి మృత్యుంజయుడుగారు, నెల్లూరు. ,,
(శ్రీ) ప్రభాత్ ప్రెస్, నెల్లూరు. ,
(శ్రీ) డి. వేంకటరెడ్డిగారు, B. A, B. L. నెల్లూరు. ,,
(శ్రీ) ఓరుగంటి నరసింహయోగిగారు, గంటి. ,,
(శ్రీ) గొట్టుముక్కల వేంకటనరసింహరాజుగారు, అయిభీమవరము. ,,
(శ్రీ)మతి సుంకర మణిరామచంద్రరావుగారు, వేంకటగిరి. ,,
(శ్రీ) జి. దశరథరామయ్యగారు, నెల్లూరు. ,,
(శ్రీ)మతి కూచి భ్రమరాంబగారు, నెల్లూరు. ,,
(శ్రీ) చింతా సత్యనారాయణమూర్తిగారు, నెల్లూరు. ,,
(శ్రీ) పోకూరు సుబ్బరామరెడ్డిగారు, నెల్లూరు. ,,
(శ్రీ) దొడ్ల సుబ్బారెడ్డిగారు, వరిగొండ. ,,

| | |
|---|---|
| శ్రీ వేమరాజు భానుమూర్తిగారు, B. A. | 25-0-0 |
| శ్రీ దామా చెంచయ్యగారు, సాయిపేట. | ,, |
| శ్రీ ఉదయగిరి చిన్నసిద్దయ్యగారు, గూడూరు. | ,, |
| శ్రీ నిట్టా ఈశ్వరయ్యగారు, కురుటూరు. | ,, |
| శ్రీ నూకరాజు వేంకటేశ్వర్లుగారు, చంద్రశేఖరపురము. | ,, |
| శ్రీ ఆర్కాటు వేంకటేశ్వర్లుగారు, నెల్లూరు. | ,, |
| శ్రీ చుండి తిమ్మారెడ్డిగారు, చేజెర్ల. | ,, |
| శ్రీ నలుబోలు శ్రీనివాసులురెడ్డిగారు, నెల్లూరు. | ,, |
| శ్రీ దొడ్డ వేంకటేశ్వరరెడ్డిగారు, మార్కాపురము. | ,, |
| శ్రీ ముప్పాళ వేంకటసుబ్బరాజుగారు, ముస్తాపురము. | ,, |
| శ్రీ సూరి శివరామమూర్తిగారు, సిద్ధవటము. | ,, |
| శ్రీ మన్నేపల్లి వేంకటనరసింహారావుగారు, కొమ్మి. | ,, |
| శ్రీ జిల్లెళ్లమూడి రాధాకృష్ణమూర్తిగారు, కందుకూరు. | ,, |
| శ్రీ సింగము నరసారెడ్డిగారు, బసివిరెడ్డిపల్లె. | ,, |
| శ్రీ పేర్ల మల్లికార్జునరెడ్డిగారు, ఎఱ్ఱగుంట్ల. | ,, |
| శ్రీ గాలి వేంకటసుబ్బరామమూర్తిగారు, కరేడు. | ,, |
| శ్రీ ఇనుకొల్లు వెంకయ్యగారు, కనిగిరి. | ,, |
| శ్రీ వంకం తిరుమలయ్యగారు, జమ్మలమడుగు. | ,, |
| శ్రీ మేకా ఏనాదినాయఁడుగారు, వవ్వేరు. | ,, |
| శ్రీ చల్లా సూర్యనారాయణశర్మగారు, B. A.B.L. తణుకు. | ,, |
| శ్రీ వేదాంతము రాజగోపాలాచార్యులుగారు, విజయవాడ. | ,, |
| శ్రీ త్రిపురమల్లు శ్రీరాములుగారు, తెనాలి. | ,, |
| శ్రీ వినపాముల సీతారామయ్యగారు, గుంటూరు. | ,, |
| శ్రీ జనస్వామి వేంకటేశ్వరశాస్త్రిగారు, తెనాలి. | ,, |
| శ్రీ సంకా వీరభద్రయ్యగారు, తెనాలి. | ,, |
| శ్రీ సంకా వేంకటేశ్వర్లుగారు, తెనాలి. | ,, |
| శ్రీ చంద్రమౌళి సీతారామయ్యగారు, తెనాలి. | ,, |
| శ్రీ అద్దేపల్లి శ్రీమన్నారాయణగారు, తెనాలి. | ,, |
| శ్రీ కురుగంటి చిదంబరశాస్త్రిగారు, ఒంగోలు. | ,, |

| | |
|---|---|
| శ్రీ కాంచనపల్లి కనకాంబగారు, విజయవాడ. | 25-0-( |
| శ్రీ మదందిరానిశాంతగ్రంథనిలయము. మూలూ్పరు. | ,, |
| శ్రీ ఆంధ్ర గీర్వాణవిద్యాపీఠము, కొవ్వూరు. | ,, |
| శ్రీ అగ్నిహోత్రము శేషాచార్యులుగారు, సజ్జాపురము, తణుకు. | ,, |
| శ్రీ జినపనేని సూర్యనారాయణరాజుగారు, సజ్జాపురము, తణుకు. | ,, |
| శ్రీ జవ్వాది, లక్ష్మయ్యనాయుడుగారు, పెనుగొండ. | ,, |
| శ్రీ సరస్వతీగ్రంథాలయము, ఒంగోలు. | ,, |
| శ్రీ మాన్ నారాయణం రామమూర్తి ఆచార్యులుగారు, పొన్నూరు. | ,, |
| శ్రీ సామవేదము శార్ఙ్గపాణిఅయ్యంగారు, పొన్నూరు. | ,, |
| శ్రీ సనాతన శైవసమాజ పుస్తకభాండాగారము, ఈమని. | ,, |
| శ్రీ మేడూరి రామనాథ దీక్షితులుగారు, కోట, కర్నూలు. | ,, |

# విషయసూచిక

# శ్రీమదాంధ్ర పద్మపురాణము

## పాతాళ ఖండము



వాణీవైభవసా
ఖ్యావహాకరుణాకటాక్ష యాశ్రితపక్షా
దేవాసురసంతతసం
సేవితపద విశ్వనాథ శిథిలితబాధా. 1

వ. అవధరింపుము శౌనకాదిమహర్షు లొక్కనాఁడు సభామధ్యగతుం డగు
సూతునిం గనుంగొని మునీంద్రా. 2

గీ. చెప్పితి వనేకగాథ లచ్చెరువు గాఁగ, వీనులకు సంతసం బయ్యెఁ గాని నేఁడు
వినఁగ రామాశ్వమేధంబు వేడ్క వుట్టె, నంతరంగములందు మా కందఱకును.

క. అనుటయు సూతుఁడు సంతస, మును జెందుచు నిట్టు లనియె మునులార పరా
త్మునికథ విన వేడుక మీ, కొనరుట యన నన్ను ధన్యు నొనరుచుటె సుఁడీ. 4

సీ. వినుఁడు వాత్స్యాయనుం డనుమునీశ్వరుఁడు ము, న్నొకనాఁ డనంతునియొద్ద కేఁగి
యహిరాజ నీయనుగ్రహమున వినఁగల్గె, సృష్టిక్రమం బెల్లఁ జిత్రముగను
నందులోపల వింటి నతిమానుషము లైన, తరణివంశమహీంద్రచరిత లెల్ల
వానిలో భువనపావన మైనరామక, థామృతం బమితపేయముగ నుండె

గీ. నట్టిరామచరిత్రమునందు వినినఁ, దలఁచినను జెప్పికొనినను గలుష మెల్ల
నఱవఱలు చేయఁ జాలు రామాశ్వమేధ, గాథయొకకొంత వినెడిభాగ్యంబు గలిగె.

క. ఆకథ సవిస్తరముగా, నాకర్ణింపంగవలయు ననియెడివేడ్కన్
నీకడకు వచ్చినాఁడను, నాకోరికి దీర్పుమయ్య నాగాధీశా. 6

—: శేషుఁడు వాత్స్యాయనునకు రామాశ్వమేధముం జెప్పుట :—

సీ. అనుటయు శేషుఁ డి ట్లనియె విప్రోత్తమ, చరితార్థమయ్యె నీజన్మ మెల్లఁ
గలుగదు పుణ్యహీనులకు సంకల్పంబు, రామకథాసుధారసము గ్రోలఁ
బరమాత్ముని స్మరించుభాగధేయము నాకు, మరల నేఁ డబ్బె నీకరుణవలన
మశకకల్పుం డైన మాదృశుం డన నెంత, రామగాథాసాగరంబు నీఁద

గీ. నడిగితివి గానఁ జెప్పెద నంతొ యింతొ, యల్పమతి నైన నాశక్తి ననుసరించి
కానిచో మింటివలె మితి లేనిరామ, భద్రకథ యేడ నే నేడఁ బక్షిసముఁడ. 7

గీ. అగ్నిసంపర్కమున స్వర్ణ మమల మైన, పగిది నాబుద్ధి పరిశుద్ధి వడయ కున్నె
యఖిలఘోరమహాపాపహరణనిపుణ, రామభద్రకథాభిమర్శమునఁ జేసి. 8

క. అని పలికి నిమిషమాత్రము, వినిమీలితనేత్రుఁ డగుచు విజ్ఞానముచేఁ
గని లోకోత్తరకథ నిటు, వినిపింపఁ దొడంగె హర్షవివశుం డగుచున్. 9

—: రాముఁడు రావణవధానంతరము సపరివారంబుగా నయోధ్యకు బయలుదేఱుట :—

సీ. అఖిలజగద్వైరి యగురావణుని నాత్మ, శితసాయకాగ్ని కాహుతి యొనర్చి
గుణవంతుఁ డగువిభీషణుని లంకారాజ్య, మునకుఁ బట్టాభిషిక్తునిఁగఁ జేసి
యింద్రాదిదేవతాబృందంబు భక్తితోఁ, జేయుప్రణామముల్ స్వీకరించి
శమధను లాత్మలం దిముడనిప్రేమతోఁ, జలుపునాశీర్వాదములను బడసి

గీ. కార్య మంతయు దీరినకారణమున
రామభద్రుండు భువనాభిరాముఁ డగుచుఁ
బుష్పకము నెక్కెఁ దనపురంబునకుఁ బోవ
జానకియు లక్ష్మణుఁడును బార్శ్వముల నుండ. 10

ఆ. బయలుదేఱి రపుడు బ్రహ్మాదు లాతని, వెంట వారివెంట వెడలెఁ బ్లవగ
నేత వానివెంట వాతాత్మజుఁడు విభీ, షణుఁడు వానరులును సాగి రంత. 11

క. చనుటయుఁ బుష్పక మాకస, మునకున్ నిర్భగ్నసదనములు గలలంకన్
గనుఁగొనుచు రాముఁ డొకప్రక్కను గాంచి యశోకవనము గతచేష్టుం డై.

క. ఒకకొంతతడవునకు జా, నకియుపచారమునఁ జేతనను జెంది బహిః
ప్రకటితము గానిమానస, వికలతతో నచటు విడిచి వెడలుచు నడుమన్. 13

గీ. విరహవేదనచేఁ దాను దిరిగినట్టి, కాననములును గిరులును స్థానములును
దాను మునిఁగినతీర్థముల్ దాను గనిన, యాశ్రమములను జూపుచు నవనిసుతకు.

గీ. అచ్చటచ్చటఁ గలవింత లవిరతముగఁ, జెప్పుచును దేనెసోనలు చిందునట్లు
సంతసమున నందిగ్రామసవిధమునకుఁ, జేరె నొకఱెప్పపాటులోఁ జేరినట్లు. 15

గీ. చేరి స్మరియించుకొని తనచిత్తమందుఁ, బాదుకారాధనైకతత్పరత నున్న
భరతుని విషాద మొదవంగఁ బలికె నిట్లు, దానుఁ డగునాంజనేయుని దరికిఁ బిలిచి.

క. అనిలతనూభవ యిప్పుడె, చని నందిగ్రామమునకు జయమున నే వ
చ్చినవార్తను దెలుపుము నా, యనుజుం డగుభరతునకు మహానందము గాన్.

క. అనవుడు స్వామినియోగం, బును వాయుసుతుండు శిరమున సుమనోమా
లను బోలెఁ దాల్చి శీఘ్రం, బున నందిగ్రామమునకుఁ బోయె మునీంద్రా. 18

—: నందిగ్రామమున భరతుఁడు దుఃఖించుట :—

వ. అప్పుడు నందిగ్రామమునందు. 19

సీ. కడగంట నైనను గానక ద్రవిణంబు, గల నైనఁ గాంతను దలఁచికొనక
యుదకకణం బైనియును ద్రావ నొల్లక, యొద్దకు రానీక యోగిరంబు
జడలు గట్టినశిరోజంబులు వహియించి, వల్కలంబులు దాల్చి వసనములుగఁ
గావించుకొని శయ్యగా గర్తదేశంబు, క్షీణించు దేహయష్టిని భరించి

గీ. భ్రాతృవిరహవిషాదాగ్ని ప్రజ్వరిల్లి, యంత కంతకు మే నెల్ల నావరింప
భరతుఁ డేమియుఁ దోఁపక భావమందు, గడియయుగముగఁ గాలంబు గడపికొనుచు.

ఉ. రా యను రామచంద్ర యనురా యనుఁ గానలలోన నుండఁ దీ
రా యను నెంతధీరుఁడవురా యను నాపయి భార ముంప మే
రా యను నిర్దయుండ వఁటరా యను దీనుని నుద్ధరింప వే
రా యను నాలసింపకుమురా యను దర్శన మీయరా యనుక్. 21

వ. మఱియును నాతం డాదిత్యాభిముఖంబుగాఁ జేతులు జోడించి నిలువంబడి. 22

గీ. లోకబాంధవ సకలలోకైకపూజ్యఁ, డైనమహనీయుఁ డెవనికై యడవులందుఁ
దిరుగవలసెనో యాపాపిదురితమునకుఁ, నెన్నటికి నైన నిష్కృతి యేరుపడునె.

గీ. సంతతము రామపదసేవ సలిపికొనుచు
ధన్యుఁడై యుండె నట సుమిత్రాసుతుండు
క్షణమును లభింపమిని రామచరణసేవ
యేడుచుచు నుండె నిటఁ గైకయీసుతుండు. 24

వ. అని కొంతతడవు పరితాపంబు నొంది. 25

సీ. వెలలేనిరాజాన్నములు దినువై దేహి, వనుల నాకలమును దినఁగ వలసె
నెండక న్నెఱుఁగక యుండుపట్టపురాణి, నట్టడవులలోన నడువ వలసెఁ
బరపురుషులకంటఁ బడియెఱుంగనిసతి, భిల్లులదరిని వర్తిల్ల వలసెఁ
బట్టుపాన్పులమీఁదఁ బవ్వళించెడితల్లి, స్థండిలస్థలులపైఁ బండ వలసెఁ

గీ. జెలులముచ్చటలకు సంతసిలెడిసాధ్వి, మృగగణారావములు విని బెగడ వలసె
నక్కటక్కట నామాత యవనిజాత, నాకతంబున నెన్ని బన్నములు పడెనొ.

సీ. ఖరకరకిరణసంక్రాంతిచే మాయన్న, వదనబింబం బెంత వాడె నొక్కొ
వనకందఖననంబువలనను మాయన్న, కరపల్లవము లెంత కందె నొక్కొ
ఘనకంటకారణ్యగతులచే మాయన్న, పదపంకజము లెంత ప్రిదిలె నొక్కొ
యుచితపోషణము లేకునికిచే మాయన్న, తనులతాద్యుతి యెంత తఱిఁగె నొక్కొ

గీ. యనుచుఁ బేరెలుఁగునను నా వార్చినట్టు, లార్చు నొకమాఱు బ్రతుకుపై నాసవిడిచి
పులుకుపులుకునఁ గంట నీ రొలుకుచుండ, నేఁడు నొకసారి మదిదుఃఖమిమ్ముడన్నిలికి.

గీ. అట్లు దుఃఖార్తుఁడై యుండునతని నాత్మ, సచివవర్గం బనునయింప సాగెఁ గాని
వారియనునయ మెల్లఁ దద్భూరిశోక, పావకమునకు నింధనప్రాయ మయ్యె.

క. అతఁ డొకపరిఁ దద్విరహా, హిత మని తలపెట్టికొనుచు నెడనెడ నవ్వాక్
బ్రతిపదము రామనామము, స్మృతి కెక్కెడిభాగ్య మందుఁ జేకుఱు చుంటన్,

ఆ. అటులు విషమదశను ననుభవించుచు మేను, దాల్చి వచ్చినట్టి ధర్మరాశి
పగిది వెలుఁగుచున్నభరతునిఁ బొడగాంచి, మారుతాత్మజుఁడు నమస్కరించి.

గీ. స్వామివచ్చుచునున్నాఁడురామచంద్రుఁ, డవనిజాలక్ష్మణసమేతుఁ డగుచు ననుడు
నపుడు భరతుఁడు స్వాంతమునందుఁ జెంది, నట్టిహర్షంబు చెప్ప నా కలవి గాదు.

గీ. అట్లు హర్షామృతాబ్ధిలో నాతఁ డోల
లాడుచును వాయుసుతున కిట్లనియెఁ దండ్రి
నన్నుఁ గొనిపొమ్ము మాయన్న యున్నకడకుఁ
జాల నిఁక నుండఁ ద్రుటియు నిచ్చటను నేను. 32

—: భరతుఁడు రామున కెదురుగా వచ్చుట :—

క. అనుటయును బయలుదేఱెను, హనుమంతుఁడు మార్గదర్శి యగుచు నతని వెం
టనె బయలుదేఱె భరతుఁడు, తన వెంటను దరలి రాఁగఁ దనవా రెల్లన్. 33

ఆ. అట్లు బయలుదేఱి యాపన్నుఁ డేతెంచు, నట్లు వచ్చుచున్న యనుజవరునిఁ
గాంచి దూరముననె కన్నీరు జలజల, రాలుచుండఁ గంట రాఘవుండు. 34

సీ. మణికిరీటము దాల్చుమస్తకం బేభంగి, భరియించినదియొ యీబిరుసుజడల
నాహ్లాదకర మైనయాననం బేచాయఁ, దాలిచినదియొ యీదైన్యగుణము
జిలుఁగువల్వలు ధరించెడికటిస్థల మెట్లు, వహియించినదియొ యీవల్కలములు
మృష్టాన్నములను వర్ధిలెడిమే నేగతిఁ, జెందఁ గల్గినదొ యీక్షీణదశను

గీ. విశ్వవిశ్వంభరాచక్రవిపులభార, వహనమహనీయతాగుణోద్వహనుఁ డైన
భరతసమ్రాట్టునకు నిట్టిపడనిపాట్లు, గలుగవలసెనె మద్వియోగమున నకట.

క. తమ్మునకు మద్వియోగవ, శమ్మున సమకొనినయీవిషాదమున శతాం
శ మ్మయినఁ గాదు వనవా, సమ్మున నా కేర్పడినవిషాద మ్మకటా. 36

క. అని చింతిల్లుచుఁ బుష్పక, మునునుండి యిలాప్రదేశమునకున్ డిగి చ
య్యన వచ్చుచుండుననుజ, న్మున కెదురుగఁ జనియెఁ బరిజనులు రా వెంటన్.

గీ. అపుడు భరతుఁడు కనుల హర్షాశ్రుధార, గాఱుచుండంగ నలఘువేగమున వచ్చి
రాఘవునిపాదములపైని వ్రాలి యుండెఁ, జిత్తరువుబొమ్మవోలె నిశ్చేష్టుఁ డగుచు.

క. అంతట రాఘవుఁడును దన, స్వాంతము దుఃఖమునఁ బరవశం బగుటయు నొ
క్కింతతడ వూరకుండి య, నంతర మొకకొంత శాంతి యాపాదిల్లన్. 39

గీ. పాదములపైని బడియున్న భరతు నెట్లొ, లేవ నెత్తుటయు నతండు భావమునకు
భ్రాతృశీతలపాణిసంస్పర్శమునను, దెలివి గలుగంగఁ గను లెత్తి తేఱి చూచి.

క. ఎన్నఁడును బడనియిడుమల, నన్నకుఁ గూర్చినఖలుండ నతిపాతకుఁడన్
నన్ను స్పృశింపకు రాఘవ, మన్నసలును గలవె యిలను మాబోఁటులకున్.

క. అని పలికి జానకికి వం, దన మొనరిచి తల్లి నీయెడకు వెత గల్గిం
చినమూర్ఖుఁడ నాతప్పులు, గనికరమున సైఁపు మీవె గతి ననుఁ గావన్.

గీ. కలశభవుని లోపాముద్రకరణి నత్రి, మౌని ననసూయవోలె నన్యూనభక్తిఁ
బతిని సేవించితివి కృతార్థత ఘటిల్ల, జనని యెంతతపంబు మున్నొనరిచితివొ.

వ. అని పలుకుటయు జానకీదేవి కరుణాకటాక్షవీక్షణంబుల భరతు నీక్షించి దీవిం
చెను. పిమ్మటఁ గైకేయీనందనుండు సుమిత్రానందనుం గౌఁగిలించుకొని. 44

గీ. ధన్యుఁడవు నీవు నీతల్లి ధన్యురాలు, పావనం బయ్యెఁ గులము నీప్రభవమున నె
వత్స లక్ష్మణ భాగ్యవివర్జితులకు, రామచంద్రునిసేవ సంప్రాప్త మగునె. 45

క. అని చింతిల్లుచు నుండం, గను భరతుని ననునయించి కౌసల్యానం
దనుఁ డితరజనుల నెల్లను, ననామయం బడిగి హర్ష మావహిలంగన్. 46

గీ. స్వపరివారంబుతోడఁ బుష్పకము నెక్కి, బయలు దేఱె నయోధ్యకుఁ బాదచారు
లగుచుఁ దక్కినజను లెల్ల నరుగుదేర, సురసమన్వితుఁ డగుపురందరుఁడువోలె.

క. అప్పుడు భరతుఁడు హర్షం, బుప్పతిలఁగ నన్న వచ్చుచుండినవార్తన్
జెప్ప మయోధ్యాజనులకుఁ, జప్పున నని సుముఖుఁ డనెడిసచివునిఁ బనిచెన్.

గీ. సచివవరుఁ డైనసుముఖుఁ డాక్షణమునంద
చని యయోధ్యకు మొదటఁ గౌసల్య కవలఁ
గలజనంబుల కెల్లను దెలియఁ జేసె
రాముఁ డరుదెంచుచున్నవార్తను మునీంద్ర. 49

క. అంతట రామాగమవృ, త్తాంతశ్రవణాభిజాతహర్షోజ్జ్ఝితకా
ర్యాంతర మగుచును బురజన, సంతానం బెల్ల వచ్చె స్వామి కెదురుగన్. 50

—: అయోధ్యకుఁ జేరి శ్రీరాముఁడు తల్లులను దర్శించుట :—

క. చనుదెంచినపురజనులను, గనుఁగొని రాఘవుఁడు గరుణ గలదృష్టులతో
డను దత్పురస్సరంబుగఁ, దననగరంబునకుఁ జేరి తత్కాలమునన్. 51

గీ. పుష్పకమునుండి దిగి భూమిపుత్రితోడఁ, బల్లకిని నెక్కి వెంటనె బయలుదేఱెఁ
గుసుమవర్షంబు దివినుండి కురియుచుండ, నఖిలజనముల కానంద మావహిల్ల.

వ. అంత నాస్వామి కృతకౌతుకతోరణంబును స్వామిసందర్శనకుతూహలత్వరమాణ
ప్రజాసంచారసమంచితంబును నాహన్యమానపణవభేర్యాదినానావిధమంగళ
వాదిత్రనాదపూరితంబును బ్లవంగప్లవనచిత్రీకృతంబును జందనద్రవసంసేక

విహాంసుకంబును విచిత్రవర్ణధ్వజాలంకృతంబును నగురుధూపనిరీక్షణనృత్యన్మ
యూరమండలంబును నుచ్చైశ్శ్రవోగర్వనిర్వాపణ ధూర్వహతురంగమసందో
హంబును నాధోరణనియంత్రితైరావణస్పర్ధాకరణవిజృంభణోజ్జృంభితగైరికాది
ధాతురచనావిరాజమానదంతావళసంతానంబును గజోపరిసమారూఢసర్వా
భరణభూషితకన్యాసహస్రవికీర్యమాణముక్తానికరంబును దూర్వాహరిద్రా
సంయుక్తపాత్రహస్తబ్రాహ్మణసువాసినీక్రియమాణనీరాజనంబును వందిమాగధ
సూతసంస్తుతిధ్వనిశోభమానంబును జయ రాఘవ జయ రామ జయ సూర్య
వంశోద్దీపక జయ దుష్టరాక్షససంహారక జయ లోకకల్యాణసంధాయక
జయ విశ్వనాయ కేత్యుచ్చార్యమాణపురప్రజాప్రహర్షభాషణభూషితంబు
ను సీతారామావలోకనకౌతూహలగవాక్షవలభిస్థితపౌరాంగనాజనమనోహర
దృఙ్మాలికాసంకులంబును నగునయోధ్యానగరరాజమార్గంబున సస్నేహావలోక
నంబు గావించుచుం జని చని. 53

క. వినయమునఁ బల్లకిని దిగి, జనములు గనుచుండ సతియు సహజన్ములు తో
డనె రాఁగఁ గైకభవనం, బునకుఁ జని యామెపాదములకుఁ బ్రొక్కెన్. 54

క. మ్రొక్కిన రామునిఁ జూడక, యక్కేకయరాజపుత్రి యవనతముఖి యై
మిక్కుట మగుత్రపతోడను, నొక్కపలుకు గూడఁ బలుక కూరక యుండెన్.

ఆ. అట్లు లూరకున్న నామెయాశయమును, నెఱుఁగకుండఁ గార్య మేది యేని
చేయఁ దగ దటంచుఁ జిత్తంబులోపల, నెంచి రామచంద్రుఁ డిట్లు లనియె.

క. జనని పదునాలుగేడులు, వనవాస మొనర్చి నీవు వాంఛించినరీ
తిన వచ్చినాఁడ మరలను, జను మన్నను జనెద నేల సందేహింపన్. 57

క. అనుటయుఁ గైకేయి మనం, బునఁ గలత్రప విడిచి తండ్రి మొదటను మాధ్యం
బున నిన్ను నడవి కనిపితి, ననియెడిచింతాగ్ని లోన నాఱక యుండన్. 58

క. చను మన్న మరలఁ జనియెద, నని నీ వనినట్టివచన మద్దానికి నిం
ధనరూప మయ్యె నాయన, యన వల దీ వింక నిట్టియశ్రావ్యంబుల్. 59

క. మనుము చిరకాల మెల్లరుఁ, గొనియాడఁగ రాజ్య మేలుకొనుచును సీతా
వనజాతనేత్రతోడను, ననుజన్ములతోడఁ గూడి యానందమునన్. 60

క. అనవుడు రాఘవుఁ డాయమ, యనుమతి గైకొని సుమిత్రయంతికమునకున్
జని తచ్చరణములకు వం, దన మొనరుప నాసతీమతల్లి ముదమునన్. 61

గీ. తండ్రి జగముల కెల్ల భద్రములు గలుగ, వర్ధిలుము చిరకాలము వసుధలోన
ననుచు దీవింప రాఘవుం డామె కిట్టు, లనియెఁ గన్నులఁ గ్రమ్మఁగా నశ్రుజలము.

గీ. అన్న నడవులలోన నొకప్పు డేని, విడువకుండఁగ వచ్చినయిడుమ లెల్లఁ
జివరదాఁకను ననుభవించినతనూజ, రత్నమును గాంచితివి తల్లి రత్నగర్భ. 63

క. అని సన్నుతించి తదనుమ, తని గైకొని సోదరులు సతీమణియును వెం
టనె రాఁగ విగతకళ మగు, జననీగృహమునకుఁ జని విషాదం బొదవన్. 64

క. కరపాదకర్ణకంఠా, భరణవివర్జితయు శోకపరితప్తహృదం
తరయుఁ గృశాంగియు మలినాం, బరయును నయి యున్న తల్లిపదముల కెఱఁగెన్.

గీ. అంతటను దండ్రి వచ్చితే యనుచు నామె, పలుకుచును లోనదుఃఖంబు నిలువకునికిఁ
గంట బోరనఁ గన్నీరు గాఱుచుండఁ, బడియె నిశ్చేష్ట యగుచును బుడమిమీఁద.

గీ. అపుడు రాఘవుఁ డుద్వేగ మావహిల్ల, నంతరంగంబునను దుఃఖ మాఁపికొనుచుఁ
జలుపుచుంటయు శిశిరోపచారములను, గొలఁది సేపటి కామెకుఁ దెలివి వచ్చి.

క. ఏఁడీ నానోములఫల, మేఁడీ నాకన్నతండ్రి యేఁడీ నావాఁ
డేఁడీ నాబంగరుగని, యేఁడీ నా రాముఁ డనుచు నేడ్చుచు లేచెన్. 68

ఉ. లేచి చివాలునన్ గవుఁగిలించికొనంగను రాముఁ డాయమం
జూచి విషాదబాష్పములు సోనలు గట్టుచు జాఱ నేడ్చుచున్
నీచరణంబులన్ గొలువనేరనిమూఢుఁడ భాగ్యహీనుఁడన్
నీచుఁడ నేను బుత్రుఁడనె నీ కిటు లమ్మరొ యేడ్వ నేటికిన్. 69

క. తలిదండ్రులశుశ్రూషను, జలుపనిపాతకులు హీనజన్మము లగుపు
ర్వులు గాక పుత్రు లగుదురె, కలుగదు వారలకు నూర్ధ్వగతి యెన్నటికిన్. 70

క. కావున నాయపరాధము, భావమునం దుంచుకొనక పావన మగునీ
సేవాభాగ్యము నా కిఁకఁ, గావింపుము గలుగ ధూతకలుషుఁడ నగుదున్. 71

క. అని పలికి తల్లి జనకా, జ్ఞను గొని చని కాననసురసంహారంబున్
బొనరించి జానకిని గై, కొని వచ్చితి మరలఁ జూడు కోడలి ననుడున్. 72

గీ. సీత కౌసల్యపదసరోజాతములకుఁ, బ్రణతి యొనరించుటయు నామె బాష్పజలము
కనుల జాఱుచునుండ నాజనకసుతను, గౌఁగిటను జేర్చికొని క్షణకాల ముండి.

క. జననీజనకుల బాంధవ, జనులను సౌఖ్యమును విడిచి చని పతితోఁ గా
ననములకుఁ దల్లి నీవలెఁ, గనరానియవస్థఁ గనినకాంతలు గలరే. 74

క. దైవసమంబుగ భర్తను, సేవించుటచేతఁ గీర్తి జెందితి విలలో
నీవలన నుభయకులములు, పావనతను గాంచె నేల బహుభాషణముల్. 75

గీ. అమ్మ జానకి నిత్యకల్యాణి వగుము, పడయు మఖిలసుఖంబులు భర్తతోడ
సుగుణగణశాలు లైనట్టిసుతులఁ గనుము, మేలుబంతిగ నుండుము మెలఁతలందు

క. అనవుడుఁ గౌసల్యకు వం, దన మొనరుప లక్ష్మణుండు నాతండ్రి కులం
బున కెల్ల వన్నె దెచ్చితి, వని కౌఁగిటఁ జేర్చి యామె యానందించెన్. 77

క. భరతుం డంతట నాయమ, చరణములకు మ్రొక్క నామె సంతోషమునన్
గరములచే నిమురుచుఁ ద, చ్ఛరీరమును గంట బాష్పజలములు జాఱన్. 78

గీ. తండ్రి భ్రాతృవియోగసంతాపమునను, నీకుఁ గలిగినదురవస్థ నేను జూచి
సైఁపఁజాలమి బ్రతికియుఁ జచ్చినట్లు, యున్నదానను గనులార నిన్నుఁ గనక.

—: భరతుఁడు రామునకు రాజ్యము నర్పించుట :—

క. అని యూరకుండుటయు నో, య్యన భరతుఁడు జనకదత్త మగురాజ్యం బ
ప్పనమొనరిచె రాఘవునకు, జను లెల్లరుఁ జూచుచుండ సంతోషమునన్. 80

వ. అంతట నొక్కసుముహూర్తమందు సప్తద్వీపమండితం బగుపృథివీచక్రంబు నొక్కవ్యాఘ్రచర్మంబున వ్రాసి దానిపైని రామచంద్రునిఁ గూర్చుండఁ బెట్టి.

గీ. కురియుచుండగ దివినుండి కుసుమవృష్టి
దుందుభులు మ్రోఁగుచుండంగ ద్యోతలమున
నమ్మహాత్మున కభిషేక మాచరించి
రమరులసమక్షమందు మహర్షు లెల్ల. 82

వ. అప్పుడు మహానందంబున నిర్జరబృందం బెల్లఁ జేతులు గట్టుకొని నిలువంబడి రామచంద్రుని నిట్లు కీర్తింపఁ దొడంగె. 83

—: దేవతలు రాముని స్తుతించుట :—

క. జయము దశరథతనూభవ, జయము మహీజాకళత్ర జయము మహాత్మా
జయము విబుధార్తిభంజన, జయ మాశరశలభనిచయశమనజ్వలనా. 84

దండకము. రామా త్రిలోకాభిరామా సహస్రాంశువంశాబ్ధిసోమా త్వదీయ ప్రభావం బసామాన్య మాపన్నసంరక్షకా వేదసందోహచౌర్యంబు గావించి యంభోధిలోఁ దూఱియుండన్ హయగ్రీవరాత్రించరగ్రామణిం గూల్చి మత్స్యావతారంబునన్ వేదరాశిన్ బ్రసాదింపవే ధాతకున్ గూర్మరూపంబునన్ మందరగ్రావమున్ మోసి బర్హిర్ముఖశ్రేణి కెల్లన్ సుధాన్నంబు సంతృప్తిగాఁ బెట్టవే పోత్రివై లోకసంతాపకారిన్ హిరణ్యాక్షరాత్రించరాధీశ్వరున్ దున్మి విశ్వంభరామండలోద్ధారమున్ జేయవే నారసింహుండవై యుద్భవం బంది కంబంబునం దద్ధిరణ్యాక్షరక్షోనుజుం జీల్చి చెండాడి యాపద్గతుం డైనప్రహ్లాదునిం బ్రోవవే వామనాకారముం దాల్చి పాదత్రయక్ష్మాతలం బర్థివై కోరి లబ్ధాభిలాషుండవై సర్వలోకంబు వ్యాపించి రెం డడ్గులన్ శిష్టమై యున్నయేకాంఘ్రిచే దుష్టరక్షోధినాథున్ బలిన్ ద్రొక్కవే యంటఁ బాతాళమున్ భార్గవాకారముం జెంది గర్వాంధమై యున్నక్షాత్త్రంబుఁ గ్రోధాగ్నిలో వేల్చి ముయ్యేడుమాఱుల్ మహీభారమున్ దీర్పవే రామచంద్రుండవై తాటకన్ మాపి గాధేయయజ్ఞంబు రక్షించి చేపట్టి సీతాసతీరత్నమున్ రాజ్యమున్ వీడి ఘోరాటవుల్ సొచ్చి నానావిధక్లేశముల్ సైఁచి లోకాపకారిన్ మహాపాపకారిన్ సురారిన్ సమూలంబుగా రావణుం ద్రుంచి లోకంబులన్ నిల్పవే త్వత్కృతం బైనరక్షోవి

నాశంబు తత్కార్యసంజాతలోకైకకల్యాణముఁ జేయునోశ్లః నుతింపంగ
సాధ్యంబె కృష్ణుండవై పుట్టి శాసించి కంసాదిహింసాపరస్వాంతులఁ గావవే
ధర్మమార్గైకసంసక్తులఁ భక్తులఁ బుద్ధరూపంబునఁ బౌద్ధమార్గంబు బోధించి
సాధింపవే దేవతాకార్యముఁ గల్కివై నాశమొందింపవే పాపలోకంబు
నెల్లఁ భవల్లీల లక్షీయముల్ సృష్టి గావింప సంకల్ప ముత్పన్న మైనఁ
సృజింపంబడుఁ సర్వలోకంబులుఁ స్వస్థతఁ జెంది యుండంగ నాకాంక్ష సంధి
ల్లినఁ స్వస్థతఁ జెంది యుండుఁ హరింపఁ దలం పేర్పడంగఁ లయం బొందు
లోకత్రయారాధ్య నీనామముల్ బ్రహ్మహత్యాదిపాపంబులఁ రూపుమాపఁ
సమర్థంబు లస్తోకమాహాత్మ్య ని న్నంట వేనాటి కైనఁ జరామృత్యుజన్మాది
దుఃఖంబు లప్రాప్య నీతత్త్వ మెవ్వం డెఱుంగుఁ గుణాతీత నీభావ మెవ్వం
డెఱుంగుఁ నిరాకార నీరూప మెవ్వం డెఱుంగుఁ సదాకార నీ వెల్లెడఁ
నిండియున్నాఁడ వంతర్బహిర్భేదశూన్యుండవై త్వచ్చరిత్రంబు చిత్రంబు
వాఙ్మానసాగోచరా ధర్మభంగం బధర్మోదయంబుఁ దటస్థించుకాలంబునం
దాత్మతేజంబుచే వ్యక్తరూపుండవై యుద్ధరింపంగదే శిష్టులఁ సంహరింపంగదే
దుష్టులఁ సర్వశక్తుల్ త్వదాయత్తముల్ నీవు గాకున్న లోకంబు లెల్లఁ
బ్రవర్తింపఁజేయఁ సమర్థుండు వే ఱొక్కఁ డెవ్వండు స్వామీ భవన్మాయచేఁ
లోను గాకుండువా రెవ్వ రీమూఁడులోకంబులఁ యజ్ఞముల్ పూర్తముల్
దానముల్ ధర్మముల్ దేవ నీప్రీతికై కాదె కావింతు రార్యుల్ తపస్వుల్
తపంబుఁ ద్వదర్థంబ కావింతు రిం తేల తత్త్వజ్ఞులై నట్టివా రెల్లకర్మంబులుఁ
నీకె యర్పింతు రాద్యుండ వీ వప్రమేయుండ వీ వప్రణాశుండ వీ వాత్మ వీ వెల్ల
కాలంబు నీపాదయుగ్మంబు లోకత్రయస్తోత్రపాత్రంబు సర్వేప్సితార్థప్రదం బస్మదీ
యాంతరంగంబులం దుండుఁగా కెప్పుడుఁ నిన్నె దర్శించుచుఁ నిన్నె ధ్యానిం
చుచుఁ నిన్నె కీర్తించుచుఁ ధన్యతం జెందుభాగ్యంబు మాకుఁ బ్రసాదింపు
మీశా నమస్తే నమస్తే నమస్తే నమః. 85

క. అని స్తోత్రము గావించుట, యును విని రాఘవుఁడు హర్ష మొందుచు మదిలో
ననిమిషులార భయంపడఁ, జన దెపుడును మీరు ధర్మశరణుల రగుటఁ. 86

గీ. ఎప్పు డెప్పు డధర్మాభివృద్ధి ధర్మ, విప్లవంబును గలుగునొ విశ్వమందు
నవతరించుచు నుందు నే నప్పు డప్పు, డట్టివిషమపరిస్థితి నణఁగఁ ద్రొక్క. 87

వ. అని సానుగ్రహంబుగా నభయహస్తం బొసంగి మరల ని ట్లనియె. 88

సీ. యుష్మత్కృతం బగునుత్తమస్తోత్రంబు, ప్రాతర్నిశలయందుఁ బ్రతిదినంబు
పఠియించునెడ నొక్కపరి శత్రువర్గంబు, నామశేషంబుగా నాశమొందు

సంక్రమింపకయుండు జాడ్య మేదియుఁ గూడ, దారిద్ర్యదుఃఖంబు తలఁగిపోవుఁ
గలుగు మామకపాదకంజాతములయందుఁ, జలనంబు లేకుండ నిలుచుభక్తి

గీ. యని పలికి యూరకుంటయు హర్షమునను
నమరు లెల్లరు స్వస్వలోకముల కరిగి
రంతటను రాముఁ డావంత యైన నయము
దొలఁగ కుండంగఁ బాలింపఁ దొడఁగె నిలను. 89

—: రామరాజ్యవిధానకథనము :—

ఆ. లేదు శత్రుభయము లే వీతిబాధలు, లేదు రోగపీడ లే దకాల
మరణ మాత్మనుతియుఁ బరనిందయును లేవు, పూజ్య మైన రామరాజ్యమందు. 90

క. పొలుపారుచుండు నెపుడును, ఫలములచేఁ బాదపములు బహుసస్యముచే
నొలయుచు నుండు సతమ్మును, నిల దశరథసుతుఁడు రాజ్య మేలుచు నుండన్.

సీ. అతివలమధ్యంబులంద దౌర్బల్యము, సలిలబిందువులంద జాడ్యవార్త
యాత్మికబృందంబునంద విలాపంబు, వేధంబు మాణిక్యవితతియంద
నదులంద కుటిలయానంబు ప్రకంపంబు, సాత్త్వికభావప్రసక్తియంద
దండంబు ఛత్త్రకుద్దాలసంతతులంద, గుణవియోగంబు మార్గణములంద

గీ. కంటకములంద తీక్ష్ణత గజములంద, దానవిచ్యుతి భంగముల్ తటినులంద
కాని ప్రజలందు నెందును గాన రావు, రాజ్య మేలుచు నుండంగ రాఘవుండు.

గీ. మడఁతులంద రజోవిభ్రమములు తమము, బహుళపక్షక్షపలయంద బంధనోక్తి
గ్రంథములయంద ప్రజలందుఁ గానరాదు, దాశరథి రాజ్య మేలెడితరుణమందు.

గీ. వర్ణములలోన వంశమువలనఁ దప్పఁ, గలుగఁబోదు కులీనత కలిమివలన
లేదు కలుషంబునకుఁ దక్క లేమి యెందు, రామభద్రుండు పాలించురాజ్యమందు.

ఆ. ఓషధులనె కుష్ఠయోగంబు పాశము, లాక్షికములకరములందె మూర్తి
హస్తములనె శూల మగపడు లే దొంట, రాజ్య మేలుచుండ రాఘవుండు. 95

గీ. అనయసందర్శనంబు స్యందనములంద, కఠినభావంబు తరుణులకడుపులంద
కాని వేఱొక్కచోటను గానరావు, దాశరథి శాసకత్వంబు దాల్చియుండ. 96

ఆ. రాముఁ డేలుచుండ రాజ్యంబు భోజన, మొకఁడు దక్క నంధ మొండు లేదు
జ్వరము లేదు కామజము దక్క మదము లే, దిభములందుఁ దక్క నెచట నేని.

క. దేవాలయసంతతులును, బావనగుణశాలు లైన ప్రజలును గలవై
కావించుఁ గనులపండువు, నేవేళను నూళ్లు రాముఁ డేలుచు నుండన్. 98

గీ. తప్పకుండంగ నిజవర్ణధర్మములను, ధర్మవృద్ధులమాటను దాఁటకుండ
జనులు వర్తించుచుందురు సంతతమును, రాజ్య మొనరించుచుండంగ రాఘవుండు.

క. ఇష్టాపూర్తక్రియలును, శిష్టాచారమును ధర్మసేవయు సతిముక్
బుష్టి వహింపఁ దొడంగెను, భ్రష్టంబులు గాక రామరాజ్యమునందున్. 100
గీ. కరుణ లేకుండుమనుజుఁడు కానరాఁడు, మహిమ లేకుండ నుండెడువాని లేఁడు
కలను నైనను వినరాదు కలహవార్త, రామరాజ్యమహత్త్వము నేమి చెప్ప.
గీ. అట్లు ధర్మైకనిష్ఠాంతరంగుఁ డగుచు, వసుధ నేకాదశసహస్రవత్సరములు
రాఘవుం డేలె సుతులట్లు ప్రజలు గొలువ. జనకునిం బోలె ననుజన్ము లనుసరింప.
క. అప్పు డ్లోకనాఁ డ్లోకరజకుం, డపవాదము నలుక డాసికై తన కాంతన్
విపినమున కనిపి రాముఁడు, సపరిజనుం డగుచు నున్నసమయమునందున్.

—: అగస్త్యమహర్షి రామునికడకు వచ్చుట :—

గీ. జలదములు లేక కురియువర్షంబు పగిదిఁ, బ్రసవములు లేక జనియించుఫలము వోలె
నచటి కాకస్మికంబుగా నరుగుదెంచెఁ, గుంభసంభవుఁ డగుమౌనికుంజరుండు.
క. అరుదెంచినయమ్మౌనికిఁ, బరమానందమున నర్ఘ్యపాద్యాదివిధుల్
జరిపి యథాశాస్త్రముగను, ధరణీసుతావల్లభుండు తా నిట్లనియెన్. 105
సీ. తాపసోత్తమ భవద్దర్శనంబునఁ జేసి, చరితార్థమయ్యె నాజన్మ మెల్ల
భద్రంబె మీవేదపాఠసంతతులకుఁ, గుశలంబె మీశిష్యకోటులకును
క్రూరజంతువులు చేకూర్పకున్నవియె మీ, యాశ్రమంబులకు నేయాపదలును
నెట్టిప్రత్యూహంబు లేని లేకుండఁగా, నుండునె మీయగ్నిహోత్రములకు
గీ. మీతపము సాగుచున్నదె యీతిబాధ, లేవియును గల్గకుండంగ నెపుడుఁ గూడ
నానతీయుఁడు కార్యమే దేనియున్నఁ, జేయుటకు భృత్యుఁ డున్నాఁడు సిద్ధముగను.
క. అనుటయు నగస్త్యుఁ డిట్లని, యెను స్వామి పరాత్పరుండ వీ వేలికగా
నెనయుచు నుండఁగ లోపం, బనునది యొకఁ డున్నె యస్మదాదుల కెల్లన్.
క. రావణముఖ్యులఁ గూల్చి, దేవతలకు మర్త్యులకును దీఱనిబాధల్
పోవ నడంచిన దేవుఁడ, వీ వొకఁడవు గాక కలఁడె యెవ్వం డైనన్. 108
గీ. ధన్యతను గల్గఁజేయునీదర్శనంబు, కోఱకు నరుదెంచినాఁడ నాకోర్కి దీరె
నింతె కాని మఱేకార్య మేని లేదు, నీవు గావింపఁదగినది నీరజాక్ష. 109
క. అని పలికి రామసంద, ర్శనజనితాహ్లాదపరవశస్వాంతుండై
మునిధర్మంబును బ్రకటన, మొనరించినచందమునను నూరక యుండెన్. 110

—: అగస్త్యుఁడు రామునకు రావణాదులచరిత్రము నెఱింగించుట :—

సీ. అటు లూరకుంటయు నమ్మహాత్మునికి, నినవంశవర్ధనుం డిట్టు లనియె.
యతివర నాచేత హతులైనరావణ, కుంభకర్ణులగాథఁ గూర్చి నాకుఁ
దలఁపు గల్గె వినంగ సెలవిమ్ము దయతోడఁ, గాలత్రయజ్ఞానశాలి వీవు
నావుడు నమ్మౌనినాథుఁ డిట్లనియె సూ, ర్యాన్వయాంభోధిశశాంక వినుము

గీ. బ్రహ్మసృష్టికిఁ గర్త యాబ్రహ్మకుదయ, మొందెను బులస్త్యుఁ డాతని కుద్భవించె
విశ్రవుఁడు సతులిద్ద రావిశ్రవునకుఁ, గలరు మందాకిని యనఁ గైకసి యనంగ.

సీ. ఆకాంతలందు మందాకిని యనునామె, కావిర్భవించి ధనాధినేత
శివునిఁ గూర్చి తపంబు చేసి తత్కృపను లం, కారాజ్యమును బుష్పకమును బడసె
రావణకుంభకర్ణవిభీషణాఖ్యులు, గలిగిరి కైకసీకామినికిని
గాని రావణకుంభకర్ణులైరి యధర్మ, చరులు సంధ్యాకాలజాతు లగుట

గీ. నట్టు లుండంగ నొకనాఁడు యక్షరాజు, స్వర్ణమణిదీప్త మైనపుష్పకము నెక్కి
సపరివారంబుగా వచ్చి సలిపి ప్రణతి, తల్లిదండ్రుల కుల్లము పల్లవింప. 112

క. జననీజనకులదర్శన, మొనగూడినదినమె సుదిన ముపలబ్ధం బ
య్యెను నేఁ డాభాగ్యము నా, కని నుతి యొనరించి నిజగృహంబున కరిగెన్.

సీ. అంతట రావణుం డది చూచి యాత్మలో, నత్యంతవిస్మయం బావహిల్లఁ
దనతల్లికడ కేఁగి జనని యిప్పుడు వచ్చి, నట్టివాఁ డెవఁ డని యడుగుటయును
కైకసి రోషంబు గలిగినచూడ్కితో, వీక్షించుచును వాని కిట్టు లనియె
మత్సపత్నీగర్భమాణిక్య మాతండు, వన్నె కెక్కెను వానిఁ గన్నతల్లి

గీ. పుట్టితిరి నాకు మీరలు పురుగులట్లు, శయనభోగాశనము లె మీజన్మములకు
ఫలము లయ్యెను గార్దభంబులకుఁ గలదె, భారవహనంబుకంటెను ఫలము వేఱ.

గీ. తప మొనర్చి శివప్రసాదంబువలనఁ, బడసె లంకాధిపత్యంబు వడసె దివ్య
సంపదలును విమానరాజమును బడసె, సాటి గలుగునె వానితోఁ గీటములకు.

చ. అనుటయు రావణుండు మది నాయమమాటలు సైఁపరామి ని
ట్లనియెను దల్లి నీకు లవ మైనను లోపము లేదు వానికం
టెను ఘన మైనశక్తిని గడింతుము ముువ్వుర మేము నల్వురున్
వినఁగను రత్నగర్భ యనువిశ్రుతి నొందెద వీవె చూడుమా. 116

గీ. కీటకల్పుఁడు ధనదుఁడు కేవలంబు, వాఁడు చేసినతప మెంత వాని కుండు
నట్టిలంకాధిపత్య మత్యల్ప మతని, శక్తి మాయొద్దఁ బొగడుట సాహసంబ. 117

ఆ. వినుము నాప్రతిజ్ఞ విశదంబుగాఁ దల్లి, యనుజయుతుఁడ నగుచు నడవి కరిగి
సలిపి ఘోరతపము స్థాపించెదను సర్వ, జగములను మదేకశాసనమున. 118

గీ. ఆవిధంబునఁ గావింపనైతి నేని, కలుగుఁ బితృలోకఘాతంబువలనఁ గలుగు
నట్టిపాపంబు నాకని యాగ్రహమున, ననుజయుతుఁ డయి కాననంబునకుఁజనియె.

క. చని దశసహస్రవర్షము, లొనరించె విరించిఁ గూర్చి యుగ్రతపం బా
దనుజాగ్రణి యొకకంటన్, గనుచు రవిన్ నిలిచి యొక్కకాలన్ నేలన్. 120

గీ. అంతటను వానియుగ్రతపోగ్ని కాఁగఁ, జాలక జగంబు లల్లకల్లోల మగుడు
నజుఁడు ప్రత్యక్షమై యిచ్చె నతని కడిగి, నట్టివరముల నెల్ల ని ట్టట్టు నాక.

క. వరములు గైకొని రావణుఁ, డరుదుగ ధనదుని జయించి యాతనిలంకా
పురరాజ్యవిమానములను, హరియించెను మొదట దుర్మదాటోపమునన్. 122

క. అది మొదలుగఁ ద్రిజగములను, సదమద మొనరించుచును నజయ్యుం డై యా
త్రిదశారి తిరుగసాగెను, మదసింధురమట్లు గనక మన్నున్ మిన్నున్. 123

సీ. అంతట నిర్జరు లల్లాడుచును బోయి, మొఱవెట్టఁ బరమేష్ఠిముందు నిలిచి
యది విని ద్రుహిణుండు త్రిదశులతోఁ గూడి, కైలాసనాథునికడకు నేఁగి
విన్నవింపఁగ నెల్లవిషయంబు నాలించి, ధూర్జటి వారలతోడఁ గూడి
దైత్యాంతకునిసన్నిధానంబునకుఁ బోయి, వృత్తాంత మంతయు విశదపఱుప

గీ. మాధవుం డాలకించి తద్బాధ లెల్లఁ, జూచుచు దయారసం బొల్కుమాడ్కితోడ
వారితో నిట్టు లనియె గీర్వాణులార, చక్రధరుఁ డుండ మీ కేల సాధ్వసంబు.

సీ. అవనిమీఁద నయోధ్య యనియెడిప్రఖ్యాతి, గాంచిననగరంబు గల దొకండు
తత్పురంబున నుండు దశరథుం డనుపేర, శంస కెక్కినయొక్కచక్రవర్తి
యనపత్యుఁ డగుటచే నాతఁడు పుత్రార్థ, మొనరించుచున్నవాఁ డొక్కక్రతువు
నతనిపత్నీత్రయమందు రాముఁడు భర, తుఁడు లక్ష్మణుండు శత్రుఘ్నుఁ డనఁగ

గీ. నవతరించెద నే నాల్గువ్యక్తులుగను, రావణుని సంహరింప మీరలును ఋక్ష
వానరాకారములు గలవారలగుచు, స్వాంశములతోడఁ బ్రభవింపుఁడవనియందు.

క. అని బోధించుటయును న, య్యనిమిషులును ఋక్షవానరాకారములన్
జనియించిరి ధాత్రిని నా, జనార్దనుఁడ వీవ యేల సత్యము దాఁపన్. 126

క. ఇనవంశోద్ధారక నీ, యనుజులు మువ్వురును దావకాంశములె సుమీ
మును గలవైరమున దశా, ననుండు హరియించె నీపణంతిని వింటే. 127

క. దురితాత్ముం డగునాబ్ర, హ్మరాక్షసునిఁ గూల్చి జగము లన్నిటికిని దు
ర్భర మగుబాధను మాన్పి, పరగం జేసితివి ధర్మపథము మహాత్మా. 128

—: రాముడు తనబ్రహ్మహత్యాపాతకమునకు దుఃఖించుట :—

గీ. అనుటయును బాష్పజలపూరితాక్షుఁ డగుచు, రామభద్రుఁడు ధరపై నిద్రవాలెనంత
సంభ్రమం బేర్పడఁగఁ గుంభసంభవుండు, నిమురుచును నంటి తచ్ఛరీరమును గేల.

ఆ. ఇట్టు లనియె రామ యేల మూర్ఛిల్లితి, వేల కలిగె శోక మింత నీకు
నఖిలలోకకర్త వగునీవె యీరీతి, భ్రాంతి నొంద నింకఁ బ్రాజ్ఞుఁ డెవఁడు. 130

చ. అనవుడు మూర్ఛఁ దేఱి వినతాననుఁడై త్రపతోడ లేచి యి
ట్లనియెను రామచంద్రుఁడు మహాత్మ హతాత్ముఁడ నైతి నాకతం
బునను గలంక మేర్పడియెఁ బూర్వమునుండియు సుప్రతిష్ఠతో
ననసినసూర్యవంశమున కెల్లను నేఁటికి నేమి చెప్పుదున్. 131

క. అకటకట చేసినాఁడను, వికలవివేకుండ నగుచు విప్రద్రోహం
బొకయాఁడుదానికొఱ కీ, యకృత్యమున కింక శాంతి యనునది గలదే. 132
గీ. వేదములు మూలములు ధర్మవిధుల కెల్ల, విప్రవంశము మూలము వేదములకు
వేదమూలంబు నఱికిన వీని కింక, నెట్టిగతి పట్ట నున్నదో యెఱుఁగ రాదు. 133
క. భూసురులకు ద్రోహంబును, జేసినవారలకు నరకసీమలలోనన్
వాసము ధ్రువ మని పెద్దలు, చేసినసిద్ధాంత మెట్లు చెఱుపఁగవచ్చున్. 134
గీ. దానమానసపర్యావిధానములకు, నర్హు లగువారు బ్రాహ్మణు లట్టిచోట
నుపహతి యొనర్చుపాపుల నుద్ధరింపఁ, గలదె యేదేని యొక్కసత్కార్య మనఘ.
క. అని వేఁడుటయు నగస్త్యుం, డినవంశోద్ధారకునకు ని ట్లనియెను నీ
వనవద్యుండవు మాయా, మనుష్యరూపుఁడవు సర్వమాన్యుఁడవు సుమీ. 136
క. నీనామము స్మరియించిన, మానవులయఘంబు లెల్ల మాయుచు నుండం
గా నీ కెక్కడి వఘములు, భానుకులోద్ద్యోత చెదలు పట్టునె శిఖికిన్. 137
గీ. నీవె కర్తవు భర్తవు నీవె, నీవె హర్త వీశ్వరుఁడవు నీవె యఖిలమునకు
నీవె నిర్గుణుఁడవు గుణి వీవె పరమ, పురుషుఁడవు నీవె ప్రకృతికిఁ బరుఁడ వీవె.
క. నీయతివ మహావిద్య సు, మా యామెను దలఁచికొన్నమాత్రముననె ని
శ్శ్రేయసము నొందుభాగ్య మ, నాయాసంబుగను బ్రాప్త మయ్యెడి ననఘా. 139
సీ. కాఁడు రావణుఁడు రాక్షసుఁడు వైకుంఠంబు, నను నిన్ను సేవించుఘనుఁడు గాని
దైవికంబుగను బ్రాప్తం బైనఋషిశాప, మున దానవత్వ మాతనికిఁ గలిగె
నసురదేహము విడనాడి నేఁటి కతండు, త్వదనుగ్రహంబున ధన్యుఁ డయ్యె
బ్రాహ్మణద్రోహపాపంబు సంప్రాప్తించె, ననుచింత వలదు నీమనమునందుఁ
గీ. గావు హంత వనుగ్రహకర్త వీవు, కాన నేపాపమును నీకుఁ గలుగ దనుచు
గద్గదస్వర మేర్పడఁ గంఠ మెత్తి, ఋషివతంసంబునకు రాముఁ డిట్టు లనియె.
సీ. తాపసోత్తమ భవద్భాషణంబున శాంతి, చేకూరదయ్యె నాచిత్తమునకుఁ
గలుషంబు ద్వివిధంబుగా నుండు జ్ఞాతంబు, నాఁగ నజ్ఞాతంబు నాఁగ మఱియు
నజ్ఞానకృత మైన నజ్ఞాత మనియును, జ్ఞానకృతం బైన జ్ఞాత మనియు
ననుశయంబునఁ బోవు నజ్ఞాత మనియును, ననుభవింపక జ్ఞాత మడఁగ దనియుఁ
గీ. బలుకుదురు పెద్ద లావాక్యములనుబట్టి
యయ్యె నజ్ఞాత మేఁ జేసినట్టియఘము
దానిని నశింపఁజేయఁ దీర్థంబొ క్రతువొ
దానమొ తపంబొ వ్రతమొ యేదేని చెపుమ. 141
క. అని ప్రార్థించుటయును ని, ట్లనియె నగస్త్యుండు రామ యఖిలజ్ఞుఁడ వ
య్యును నీ విట్టు లడుగుటలున్, గన లోకానుగ్రహంబ కారణము సుమీ. 142

గీ. అనఘ రింపుము చెప్పెద నశ్వమేధ యాగమును బ్రహ్మహత్యాఘ మంతరించు
నది మహాబలు లైనమాయట్టిన్పృపులె, యాచరింపఁగ నర్హు లనర్హు లొరులు.

క. మనువు మరుత్తుండు పృథుం, డును సగరుండును దిలీపుఁడును మున్నగువా
రొనరించి యశ్వమేధము, మును గాంచిరి దివ్యధామములను నరేంద్రా. 144

క. శతమన్యుఁడు ము న్నొనరిచి, శతాశ్వమేధములు త్రిదివసామ్రాజ్యశ్రీ
పతి యయ్యె వాజిమేధ, క్రతు వఖిలాభీష్టసిద్ధికరము మహీశా. 145

చ. అనుటయు రామచంద్రుఁ డెనయన్ మది ధైర్యము కొంత స్వామి యే
యనువున నుండఁగావలెనొ యశ్వము తద్విధి యెట్లొ చెప్పి నా
మనమున నున్న ఖేదమును మాన్పుము నావుడు నమ్మహర్షి యి
ట్లనియెను సూర్యవంశకలశాబ్ధిసుధాకర యాలకింపుమా. 146

—: అశ్వమేధవిధానకథనము :—

గీ. శ్యామకర్ణము శ్వేతదేహమును రక్త, వదనమును బీతపుచ్ఛము వాయువేగ
సహితమును శుభలక్షణసంభృతమును, నగుహయం బశ్వమేధయాగార్హ మనఘ.

వ. అట్టిహయంబును వైశాఖపూర్ణిమయందు యథావిధిగఁ బూజించి తత్ఫాల
దేశంబున స్వనామబలచిహ్నితం బగునొక్కస్వర్ణపత్త్రంబు గట్టి విడువవలయు.

క. తురగం బెచ్చటి కెచ్చటి, కరుగునొ తద్రక్షణార్థ మతిశౌర్యబల
స్ఫురణాన్వితు లగురక్షకు, లరుగుచు నుండంగవలయు నచటి కచటికిన్. 149

క. ఆవాజిమేధతురగము, నేవీరులు గాని పట్టి రేని భుజాద
ర్పావిష్టు లగుచు వారల, చేవ యడఁచి రక్షకులు విజేతృత్వమునన్. 150

క. విడిపింపవలయు హయమును, దడఁబడకుండంగ నావిధంబున భువి నె
ల్లెడలను దిరుగఁగ వలయును, గడిమిం జూపుచును బురుషకారముతోడన్.

ఆ. కర్త యాగదీక్ష గైకొని మృగశృంగ, ధరుఁడు బ్రహ్మచర్యపరుఁడు ధర్మ
శీలనానుషక్తచిత్తుండు నగుచును, నుండి క్రతువు చేయ నున్నచోట. 152

గీ. ఓదనము గోరువారికి నోదనమును, వస్త్రములు గోరువారికి వస్త్రములును
ధనమును ధనార్థులకు నిచ్చుచును సతంబుఁ, గడపవలయును నొకయబ్దకాలమధిప.

క. అనుటయు రాముఁడు హర్షం, బును జెందుచు సత్వరంబ మునినాథునితో
డను వాజిశాలకుం జని, కనుము మఖతురంగ మిందుఁ గలదె మహాత్మా. 154

గీ. అనుటయును వాని సంఖ్య లేనట్టియాగ
హయములను జూచి మదిని విస్మయముఁ జెంది
రామ కల విం దసంఖ్యాధ్వరములు సేయఁ
దగినయట్టితురంగరత్నములు కంటె. 155

ఉ. నానృపుఁడు రామచంద్రుఁడు మనంబునఁ జెప్పఁగ లేనిసంతసం
బావహిలన్ ఘటోద్భవసమన్వితుఁడై తనపార్శ్వసీమలన్
సేవకు లేఁగుదేరఁగను జేరి వెసన్ సరయూమహానదీ
పావనతీరభూమి కొకపట్టున నమ్మునిరాజునానతిన్. 156

గీ. స్వర్ణలాంగలములచేతఁ జదరముగను, నాల్గుయోజనములమితి గల్గినట్టి
నేల దున్నించి యధ్వరశాల నచట, నేరుపఱచెను లక్షణోపేతముగను. 157

గీ. యోనిమేఖలచే నొప్పు చుండునగ్ని, కుండమును రత్నములచేతఁ గూర్పఁబడిన
మండపములను గన్నులపండువుగను, గ్రాలఁదొడఁగెను హయమేధశాలయందు.

ఉ. అంతట మౌనిసత్తముల కందఱకున్ హయమేధయాగవృ
త్తాంతము విన్నవించుటకునై తనశిష్యులఁ బంచె జానకీ
కాంతునిప్రార్థనంబున నగస్త్యుఁడు వార్తను విన్నమాత్ర న
త్యంతకుతూహలంబు లెనయన్ జనుదెంచిరి మౌనిసత్తముల్. 159

ఆ. అరుగుదెంచినట్టివ్యాసాత్రిగౌతమ, యాజ్ఞవల్క్యనారదార్ష్టిషేణ
పర్వతాసితాదిపరమర్షులకు నెల్ల, నాచరించె రాముఁ డర్ఘ్యపూజ. 160

గీ. అంతట వచించె ఘటజన్ముఁ డధ్వరంబు, మొదలు వెట్టంగఁ దగినట్టిమూర్తమపుడు
కాలజిత్తనుసేనాని క్రతుహయంబు, నటకు రావించె సౌమిత్రియాజ్ఞచేత. 161

గీ. ప్రభువుకై వడి సపరివారముగ వచ్చి, నట్టిహయరత్నమును జూచి యచట నుండి
నట్టివా రెల్లఁ జెందినహర్ష మింత, యంత యని చెప్పఁగను నాకు నలవి గాదు.

గీ. అపుడగస్త్యుఁడు చెప్పినయట్లు స్వర్ణ, దారయుతుఁడయి క్రతుదీక్ష దాల్చె రాముఁ
డాత్మకృతమైనబ్రహ్మహత్యాఘ ముడుగ, నందఱును విన సంకల్ప మాచరించి.

వ. అంతట రఘుకులంబునకుఁ బూర్వగురుం డగువసిష్ఠుని నాచార్యత్వంబునందును వాల్మీకి నాధ్వర్యవంబునందును దేవలాసితులను బూర్వద్వారంబునందును నత్రికశ్యపులను దక్షిణద్వారంబునందును జాజలిజాతూకర్ణ్యులను బశ్చిమద్వారంబునందును నేకతద్వితీకులను నుత్తరద్వారంబునందును నియమించి కణ్వునకు ద్వారాధిపత్యంబు నొసంగి యగస్త్యుండు బ్రహ్మత్వంబు వహించి యశ్వంబు నర్చించె. 164

గీ. ఆవల సువాసినులు సేసి రశ్వపూజ, గంధపుష్పాక్షతాద్యుపకరణములను
నవల వారాంగన లొనర్చి రమ్మఖాశ్వ, రాజమున కర్చనమును వర్ధాపనమును.

వ. తదనంతరంబ కుంభసంభవుండు.

సీ. ఇనవంశభూషణంబును ధనుర్ధరమౌళి, యును నైనదశరథజనవరునకు
సతులయం దగ్రగణ్యతను గైకొనినట్టి, కౌసల్య యనురాజకన్యకకును

క. అని యాదేశించి కనుం, గొని యచ్చటివీరనాయకుల నిశత్రు
ఘ్నుని వెంట సహాయముగను, జనఁ గలిగినశౌర్యధనుఁ డిచట నున్న యెడన్.

—: వీరాగ్రేసరు లశ్వమేధాశ్వమువెంట నరుగుట :—

క. అరుదెంచి యతఁడు మామక, కరవీటకమును గ్రహించుఁగాక యనుటయున్
భరతాత్మజుఁ డగుపుష్కలుఁ, డరుదెంచి వినయంబు మీఱ నతిధైర్యమునన్. 181

సీ. గ్రహియించి రామునికరపంకజమునుండి, వినయావనమ్రుఁడై వీటకమును
రామచంద్ర త్వదీయనామమాత్రము విన్నఁ, దల యొగ్గుదురు దేవదానవులును
దలపైని భవదాజ్ఞ దాల్చినవాఁడనై, శత్రుఘ్నునకు నుందు సాయముగను
నీయనుగ్రహ మున్న నిలుపంగఁ జాలనె, నిఖిలలోకములను నే నొకండఁ

గీ. ననుటయును వత్సబాలుఁడవయ్యుఁ దగిన, వాఁడ వనిపించితివి సూర్యవంశమునకు
సంతసించితి నీధైర్యసాహసముల, కరుగు మట్టులె యని రాముఁ డనుమతించి.

క. హనుమంతునిఁ గనుఁగొని యి, ట్లనియె మహావీర తావకానుగ్రహ ముం
డినకతనఁ గాదె నే నీ, యనువున నిలువంగఁబడితి నవనీస్థలిలోన్. 183

ఆ. తెలిసె నొక్కపెట్ట జలధి దాఁటిననాఁడు, నిరుపమాన మైననీబలంబు
నేఁడు సేన కెల్ల నీవు నాయకుఁడవై, యుండి నడుపు మన్యుఁ డొక్కఁ డేల. 184

క. పాలింపుము నాతమ్ముని, బాలించినయట్లు నన్నుఁ బరుల నడంపం
జాలినవాఁడవు ప్రజ్ఞా, శాలివి యుక్తప్రబోధనాతురుఁడ వనఘా. 185

క. అని యాదేశించుటయును, హనుమంతుఁడు దాల్చె రాఘవాజ్ఞను శీర్షం
బునఁ బ్రణతిపూర్వకంబుగ, ననురూపగుణంబ కాదె యని భక్తులకున్. 186

వ. పిదప రామభద్రుండు సుగ్రీవజాంబవదంగదగవయమైందదధిముఖశతబల్యక్షక
నలనీలాదికపివీరుల నెల్లఁ గార్యసాధకులుగా నియోగించి మంత్రిసత్తముం డగు
సుమంత్రునిం జూచి యి ట్లనియె. 187

గీ. మంత్రిశేఖర యశ్వసంరక్షణమున
కర్హు లగువీరు లిం దెవ్వ రైనఁ గలరె
యనుటయు సుమంత్రుఁడు నిబద్ధహస్తుఁ డగుచు
నెదుట నిలువంగఁబడి స్వామి కిట్టు లనియె. 188

గీ. దేవ కలరు మహాబలుల్ ధీరు లఖిల, శస్త్రవిదు లెందఱేని యిచ్చటను వారి
లోనఁ గల రగ్రగణనీయు లైనయట్టి, వీరు లొకకొంద ఱుపహతవైరిజనులు. 189

గీ. తురగమును గావ నీలరత్నుండు పనుపఁ, దగు దశాక్షౌహిణులతోడ ధరణినాథ
యని యొసఁగుచు లక్షసైన్యంబుతోడ, లక్షసైన్యంబు రక్షింప దక్షుఁ డతఁడు.

క. కురియించుఁ బ్రతాపాగ్ర్యుఁడు, శరములు సవ్యాపసవ్యశయముల నాతం
డరుగఁ దగు హయమువెంటను, నిరువదియక్షౌహిణులకు నేలిక యగుచున్. 191

గీ. తపము గావించి నేరిచె ధాతవలన, సకలశస్త్రప్రయోగోపసంహృతులను
సధిప లక్ష్మినిధిచనంగ హయము వెంట, నప్పుఁ డొక్క యక్షౌహిణి కధిపుఁడగుచు.
గీ. స్వామి రిపుతాపుఁడు సమస్తచాపధరుల, కగ్రసరుఁడయి తగ వేగ హయము వెంట
సర్వశస్త్రాస్త్రకౌశల్యశాలు లగుట, శస్త్రవిదుఁ డుగ్రహయుఁడును శుముల చూచె.
క. కల రింకను వీర లనే, కులు శత్రుఘ్నాజ్ఞ దాల్చి కుసుమముఖోల్కన్
దలలపయిని నౌద్ధత్యము, గలవారిని రూపుమాపఁగలిగినవారల్. 194
క. అని విన్నప మొనరుచుటయు, నినకులవర్ధనుఁడు హర్ష మొనయఁగ హయపా
లనమునకై యాజ్ఞాపిం, చెను మంత్రి వచించినట్టి శ్రేష్ఠుల నెల్లన్. 195
ఉ. అంతట సమ్మహాబలసమంచితు లందఱు సాంపరాయవృ
త్తాంతము వింటి మిప్పటికి సంచు మనంబులలోన నుబ్బుచున్
గుంతములున్ గృపాణములుఁ గోలలుఁ జాపములున్ ధరించి వి
క్రాంతి యనేకదేహములు గైకొని నిల్చినయట్లు నిల్వఁగన్. 196
వ. అప్పుడు రామభద్రుండు కుంభసంభవుండు చెప్పినవిధంబున నధ్వరాశ్వంబును బూజించి యాచార్యునకు షష్టిహాయనంబులు గలకుంజరంబును రత్నమాలాలంకృతంబును మనోవేగంబును సగుఘోటకంబును మణిఖచితంబును వాజిచతుష్టయవిభ్రాజితంబును సర్వోపస్కారసంయుతంబును సగురథంబును లక్షమాణిక్యంబులును ముక్తాఫలతులాశతంబును విద్రుమతులాసహస్రంబును సస్యసంపూర్ణంబును బహుప్రజాసంపన్నంబును నగునొక్కగ్రామంబును దక్షిణగా నొసంగి పదప బ్రహ్మకును హోతకును నధ్వర్యునకును ఋత్విజులకును యథార్హంబుగా దక్షిణ యొసంగి బ్రాహ్మణోత్తములకుఁ గన్యాదానభూదానగోదానహిరణ్యదానహస్తిదానహయదానరత్నదానరజతదానమౌక్తికదానతిలదానపయోదానాన్నదానంబులును నభయదానంబును గావింపం దొడంగె. 197
గీ. పెట్టుఁ డన్నంబు నన్నంబుఁ బెట్టుఁ డిండు, ధనము ధన మిండు వచ్చినజనుల కెల్ల
లేదు పొమ్మనుమాట రా రాదు నోట, ననెడునాజ్ఞాధ్వనుల నభోవనులు నిండె.
గీ. అట్లు సవనంబు ప్రారంభ మగుడు నన్న, యాన గైకొని శత్రుఘ్నుఁ డరిగి తల్లి
కడకుఁ బ్రణమిల్లి తత్పాదకంజములకుఁ, దెలిపె భ్రాతృనిదేశంబు తేటపడఁగ.
క. అది విని సుమిత్ర హర్షం, బొదవఁగ దీవించె విజయ మొనగూడుసుతుల్
పదపడి శత్రుఘ్నుఁడు త, త్పదములకున్ మ్రొక్కి యన్నపజ్జకు వచ్చెన్. 200
వ. అంతట నగస్త్యుండు మఖాశ్వంబును హస్తంబునఁ దట్టుచు. 201

—: అగస్త్యుఁ డశ్వమేధాశ్వమును విడుచుట :—

గీ. హయవతంసమ నిన్ను యాగార్థ మిప్పుడు, విడుచుచున్నాము స్వేచ్ఛమై బుడమి నెల్లఁ
దిరిగి వాయుజనంబున మరల రమ్ము, త్వరితముగ నని పల్కి యశ్వమును విడిచె.

గీ. అతఁడు చేయంగఁదగిన కార్యంబు నెల్లఁ, జెప్పెఁ జెవిలోన మంత్రంబు చెప్పినట్లు
కాముఁ డది విని యుత్సాహకలితుఁ డగుచు, వృత్రసంహారకారికి నిట్టు లనియె.

గీ. అధిప బ్రహ్మాదులకుఁ గూడ నడలు గొలుపఁ, గలిగినమదీయబాణాభిఘాతమునకు
మనుజుఁ డన నెంత యాతనిమహిమ యెంత, పంచశరుఁ డుండ నీ కేల భయము చెపుమ.

గీ. కౌశికుం డూర్వశికి సుధాకరుఁడు తార, కీ వహల్యకు శివుఁడు మోహినికి లొంగు
టవనికలనను గలిగెనో యెఱుక పడదె, చిత్రభారతమును విప్పి చెప్పవలెనె. 212

క. అని పలికి యింద్రుననుమతిఁ, గొని పరివారమును దోడుకొని శీఘ్రమునన్
జని హేమకూటమునకుం, గని సుముఖుని శరము లేయఁగాఁ దొడఁగుటయున్.

గీ. మలయమారుతము వీవఁ గోయిలలు గూయ
మధురముగ నుల్లసిల్లంగ మాధవుండు
చెలులతోఁ గూడుకొని రంభ చెలువు మెఱయ
సుముఖభూపాలకునిసమీపమున కేఁగి. 214

గీ. శిలలు స్రవియించుగతి మ్రోల్గు చివురు వెట్టు, కైవడిని బాడఁ దొడఁగెను గంఠ మెత్తి
యది వికారంబు గొలుపంగ మదికి గనులు, విచ్చి కలయంగఁ జూచె బృథ్వీధవుండు.

గీ. అంత నయ్యప్సరోంగనలందు నొకతె, సలిపె శృంగారచేష్టితంబులను నొకతె
చూపె సవిలాసమధురదృష్టులను నొకతె, సాహసంబున నొత్తెఁ దచ్చరణములను.

సీ. అప్పుడు సుముఖుఁ డిట్లనియె వారలఁ జూచి, సారసేక్షణలార మీర లెవరొ
మీధామ మేదియో మీ రిచ్చటి కేఁగు, దేరంగ నెయ్యది కారణంబొ
తిలకింప మీదివ్యదేహంబులను దోఁచె, మాపగ దేవతారూపములుగఁ
జరితార్థ మయ్యె నాజన్మ మెల్లను దుర్ల, భం బైన మీదర్శనంబువలన

గీ. ననుటయును జూచి రంభ యి ట్లనియె నధిప, పలికెద యథార్థముగ నీవు సలుపునట్టి
తపమునకు నేఁడు చేకూరెఁ దగినఫలము, తడవు సేయకు మనుభోక్తృతను వహింప.

గీ. ఈవరాంగన యూర్వశి యీసరోజ, గంధి మేనక యీచారుగాత్రి తార
యీలతాంగి తిలోత్తమ యేను రంభ, నందఱము గూడ నప్సరస్సుందరులము.

గీ. మావిహారవనమ్ములు మావిలాస, సదనములు నీవు చూచిన వదలఁగలవె
రమ్ము మాతోడ నీవిమానమ్ము నెక్కు, మెమ్ము ఫలియించినది నీతపమ్ము భూప.

సీ. నందనారామమ్మునందు మాతోఁ గూడి, క్రీడింప నీకుఁ గాంక్షితము గలదొ
మేరుశృంగంబులమీఁద మాతోఁ గూడి, విహరింపఁగా నీకు వేడ్క గలదొ
యమరస్రవంతీతీరమున మాతోఁ గూడి, వసియింపఁగా నీకు వాంఛ గలదొ
కుముదబాంధవమండలమున మాతోఁ గూడి, యమృతంబు గ్రోల నీ కాస గలదొ

గీ. తీవపొదరిండ్లఁ బచ్చరాతిన్నెలందు, నూలుకొని యుండుపూలపానుపులమీఁద
మమ్ముఁ గవఁగూడి మదనసామ్రాజ్యలక్ష్మి, నేలుకొన నిచ్చ గలదొ నీ కెఱుఁగఁ జెపుమ.

క. అనుటయు సుమదక్ష్మాపతి, మనమున విస్మయము గదుర మానిసులకు ని
ట్లనియెను దల్లులు మీరలు, తనయుండను నేను మీకుఁ దగ దిట్లాడన్. 221

ఆ. సమఁ బరీక్ష సేయఁగను నీశ్వరియె యిట్టు, లడుగుదెంచె యుష్మదాకృతులను
సంతె కాని తపస్య మగుసౌఖ్యమున నేల, కాలఁ గ్రోయు సేవకుని మదంబ. 222

క. అని కనులు మూసికొనుటయుఁ, గనుఁగొని మనసిజుఁడు నిర్వికారుం డగునా
తనిఁ గలఁపఁజాలమిని బరి, జనయుతుఁ డయి యేఁగె దిరిగి స్వర్గంబునకున్. 223

సీ. అంతటను సింహవాహన యతినిపుణ, నిష్ఠ కానందమును జెంది నెమ్మనమునఁ
జాపబాణాంకుశపృషత్కసహిత యగుచు, వచ్చె యెదుటను నిల్చె భూపాలభువనకు.

గీ. అపుడు సుమదమహీపాలు డర్కకోటి, దీప్తులను వెదచల్లుచుఁ దేజరిల్లు
నంబ నీక్షించి వందనం బాచరించి, కడఁగె నుతియింప నిట్లు గద్గదికతోడ.

సీ. ఆధారశక్తి వైనట్టినిచే దేవి, ధరియింపఁబడు చుండు ధరణి యెల్లఁ
దల్లి నీకళచేత నుల్లసిల్లుచు నుండు, సచరాచరము లైనజగము లెల్ల
నినుఁడు రసంబు గైకొని యిచ్చుచుండును, సర్వేశ్వరి త్వదీయశక్తివలన
సంతర్పహిష్ఠితుం డయి కొల్పుచుండు సౌఖ్యము వహ్ని త్వత్ప్రితాపమున మాత

గీ. యీవు విష్ణుమహామాయ వీవు విద్య, వీవు లోకంబులను సృజియింతు వీవు
పెంతువు హరింతు వీవు నే నెంతవాఁడ, నమ్మ భవదీయమాహాత్మ్య మభినుతింప.

క. అని దేవీసందర్శన, జనితానందమునఁ బరవశత్వము గలుగం
గను మ్రోఁకువోలె నిలిచిన, జనపతిని స్పృశించి లోకజనని కరమునన్. 227

ఆ. వత్స కోరుకొనుము వాంఛిత మే దైనఁ, దీర్చెదాన ననుడుఁ దేఱిచూచి
యిట్టు లనియె సుమదుఁ డీశ్వరి దాసుని, పైని గరుణ గలిగెనేని నీకు. 228

క. అరిహృత మగుసామ్రాజ్యము, కరగతముగఁ జేసి నన్నుఁ గావఁగ నెపుడున్
దరిసెన మొసఁగుచును ననం, తరమున మోక్షంబు నాకు దయచేయఁగదే.

క. అనుటయుఁ గాత్యాయని యి, ట్లనియెను సుత నిస్సపత్న మగురాజ్యము నీ
కొనగూడు సతతమును ద, ర్శన మిచ్చుచు నేను నీపురంబున నుందున్. 230

గీ. రావణవధంబు గావించి రామచంద్రుఁ, డశ్వమేధాధ్వరంబు చేయంగఁ బూని
హయము వెంటను బనుచు నిజానుజన్ముఁ, డైనశత్రుఘ్నుని నొకప్పు డట్టితఱిని.

గీ. అర్పణముసేసి నీవు రాజ్యంబు నెల్ల, నాతనికి రామచంద్రప్రియంబు గాఁగ
సైంధవము వెంటఁ దిరిగి దేశములు నుదకుఁ, బడసెదవు ముక్తి రామునికడకుఁ జేరి.

క. అని పలికి తిరోధానము, గనుటయు సుమదుండు వేడుకను నిజపురికిన్
జనుదెంచి వైరిసంహృతి, యొనరించి స్వరాజ్యలక్ష్మి నొందినపిదపన్. 233

క. నెలకొల్పెను గామాక్షికి, నిలయంబును నామె యందు నెలకొని యుండెన్
జలుపుచు భద్రదక్షిణ ..., నిలయమె యిది మనకు దర్శనీయం బధిపా. 234

క. అనుటయు శత్రుఘ్నుం డా, తనితోడను గూడుకొని ప్రసన్నాననుఁడై
నొనరించి దేవతాద, ర్శనము ప్రమోదమున నున్నసమయమునఁ గాకన్. 235

—: సుమదుఁడు స్వరాజ్యమును శత్రుఘ్నున కర్పించుట :—

వ. రామచంద్రుం డశ్వమేధయాగార్థంబు విడిచినతురగం బహుచ్ఛత్రోపగోద్యానంబున విహరించుచుండె ననియును దద్రక్షణార్థంబు శత్రుఘ్నుండు సేనాసమేతంబుగా నేగుదెంచి కామాక్ష్యాలయంబున నున్నవా డనియును వేగులవలన నాకర్ణించి సుమదభూపాలుండు దేవీవచనంబు స్మరియించుకొని ప్రహర్షపరవశీకృతమానసుండై నిజప్రజానివహంబుతోడఁ గూడుకొని మంగళవాద్యంబులు మిన్నుముట్ట వినీతవేషంబునఁ బాదచారి యగుచు శత్రుఘ్నునిసమీపంబున కరుదెంచి సాష్టాంగవందనం బాచరించి. 236

క. రామానుజ నీదర్శన, మీనాఁ డిక్కడ ప్రాప్త మగునదృష్టము మాకున్
గామాక్ష్యనుగ్రహమ్మున, నామతి లెన్ జన్మచారితార్థ్యం బొదవన్. 237

సీ. రాఘవప్రీతికరంబుగా నీకు న, ర్పణ మొనర్చితిని నా రాజ్య మెల్ల
గ్రహియింపుమీ వనుగ్రహముతోడ ననుచుఁ, బ్రార్థించుటయు భక్తిభావమునను
శత్రుఘ్నుఁ డతనివిశ్వాసంబునకు మెచ్చి, సమధికం బైనహర్షంబుతోడఁ
దత్తనూభవునిఁ దద్రాజ్యంబునకు నభి, షిక్తునిఁ గావించి శీఘ్రముగను
గీ. బయలుదేఱుటయును యజ్ఞహయము వెంట, నతని వెంటను శరచాపహస్తుఁ డగుచు
నాత్మపరివారసేనాసమన్వితముగ, బయలుదేఱెను సుమదభూపాలమౌళి. 238

సీ. అంతట శత్రుఘ్నుఁ డాతనితోఁ గూడి, తన సేన వెనుకను దరలిరాఁగ
నరుగుచు మార్గమధ్యమునందుఁ జూచుచుఁ, జూడఁగాఁ దగినట్టివోటు లెల్ల
నొకకాననమునఁ జూడ్కికి విందుసేయుచు, నున్న ఋష్యాశ్రమం బొండు గాంచి
యఖిలాశుభంబుల నడఁచు వేదధ్వని, నత్యాదరంబుతో నాలకించి
గీ. సింహగజమిత్త్రితయును మూషికబిడాల, సౌహృదంబును విషధరశశమయూర
సరససంక్రీడనంబును హరిణతతుల, స్వైరవిహృతియు మదికి విస్మయము గొలుప.
గీ. సుమతి యీయాశ్రమంబును జూడఁ జూడ
నంతకంతకుఁ దోఁచెడి నద్భుతముగ
నేతదధినాథుఁ డగుమహాఋషి యెవండొ
తన్మహిమ మేమొ విన నాకుఁ దలఁపు గలిగె. 239

—: చ్యవనమహర్షిచరిత్రకథనము :—

క. అనుటయు సుమతి ప్రమోదం, బెనయఁగ నిట్లనియె స్వామి యిది చ్యవనమహా
ముని యాశ్రమంబు తన్మహి, మను వచియింపంగఁ దగవె మాబోఁటులకున్.
సీ. ఐనను నీయాజ్ఞ యవిలంఘ్య మగుట నే, నెఱిఁగినది వచింతు నింతొ యంతొ
బ్రహ్మవంశంబునఁ బ్రఖ్యాతుఁ డై పూర్వ, ముండె భృగుం డను నా నొక్కమౌని

ధ్యానించి యథావిధి నర్చనంబు గావించి పాత్రాసాదనంబు చేసి యన్నంబును భక్ష్యభోజ్యశాకలేహ్యసూపాదులును వడ్డించి యభిఘారంబు గావించె. 2340

ఆ. అంత నతిథి యిట్టు నట్టును జూచుచు, రామ శీఘ్రముగను బ్రణతి సేయు
మాఁగఁజాల నింక నాఁకలి మెం డయ్యె, నాజ్ఞ యైన నిపుడె యారగింతు.

క. అనుటయు రాముఁడు వినయం, బున మ్రొక్కి మహాత్మ శీఘ్రముగఁ బై కార్యం
బును నడపెదఁ ద్వరపడకుము, కనికరమున ననుచు వేఁడి గ్రక్కున నంతన్.

వ. కర్మకలాపం బంతయు యథాక్రమంబుగా జరిపి యాపోశనంబు నర్పించె. అంతట బ్రాహ్మణులు యథాసుఖంబుగా భుజించుచుండ ఋత్విజులు రక్షోఘ్న మంత్రపఠనంబు గావింపం దొడంగిరి. 2343

ఆ. అప్పు డతిథి యైనయవనిబృందారకుఁ, డాత్మపాత్రగతపదార్థ మెల్లఁ
గలిపి యొక్కముద్దగా గుటుక్కున మ్రింగి, యందఱకును గూడ నచ్చెరువుగ.

ఆ. రామ నాకు నొక్కప్రాణాహుతికిఁ గూడఁ, జాల దీవు నేఁడు సలిపినట్టి
శ్రాద్ధయత్న మెల్ల శక్తి లేకుండిన, శ్రాద్ధవిస్తరంబు సలుప నేల. 2345

మ. అని గంభీరముగా వచించుటయుఁ దద్వ్యాహార మాలించి యే
మనఁగన్ దోఁపమి నప్డు రాఘువుఁడు చింతాక్రాంతుఁ డై శంభునిన్
గన నాతండు నిజాంగనన్ గనుడు నాకంజాక్షి యేతెంచె గ్ర
క్కునఁ జేతం బరమాన్నభాజనముఁ జిక్కంబట్టి వడ్డింపఁగన్. 2346

క. అరుదెంచినయామెను గని, పరమానందమున నతిథి పాణిని జాఁపన్
దరుణీమణి వడ్డించెను, బరమాన్నము నక్షయముగ భావించి మదిన్. 2347

గీ. అట్లు వడ్డింపఁ బరమాన్న మావధూటి
బ్రాహ్మణుఁడు జుఱ్ఱి జుఱ్ఱునఁ బైనిఁ గనుచు
శిరము ద్రిప్పుచు మెచ్చుచు మరలఁ జాఁచె
హస్తమును నది చూచి యి ట్లనియె నామె.

గీ. స్వామి పాయస మెల్ల హస్తంబునందు, పొరలిపోవుచు నున్నది మరల నేల
చాఁచితివి కేలు త్రాగుము సత్వరంబ, తృప్తి గలుగంగ వడ్డింతు నెంత యేని.

క. అనవుడు విప్రుఁడు దనకర, మున నుండినపాయసాన్నమును ద్రావి కనుం
గొని మరల నుంట నది కర, ముననె మరలఁ ద్రావ మరలఁ బూర్తిగ నుండెన్.

క. అది యంతయు నాశ్చర్యం, బొదవింపఁగ మదికి బ్రాహ్మణోత్తముఁ డింక ని
య్యది గాదు మార్గ మనుకొని, యద నేఁగక యుండ వాసుహస్తముఁ జాఁచెన్.

గీ. అప్పు డది చూచి యాసాధ్వి యాత్మలోనఁ
ఆర్యు డిట్టులె భావించి యోసి నతని

హస్తమునఁ బాయసము నది యారగించి
తఱుఁగ కుండుటఁ గాంచి యాధరణిసురుఁడు. 2352

గీ. సృష్టి గావించుకొని యొకచేయి మరలఁ, జాఁచుటయుఁ బోసె మునుపోలెసారసాక్షి
యదియువదలక యుండుట హస్తమందు, మఱియొకకరంబుఁ జాఁచి భూమాసురుండు.

గీ. ఇంతి యర్పింపు మిందులో ఘృతము ననుడు
నామె మునుపోలెఁ దలఁచి యాజ్యంబు వోసె
నదియు నక్షయ మగుటయు నవనిసురుఁడు
పాణి మఱియొండు చాఁచి సూపంబు నడిగె. 2354

గీ. అంత నాసాధ్వి మునుపోలె నక్షయముగఁ
దలఁచి సూపంబు నతనిహస్తమున నుంచె
నదియుఁ దఱుఁగక యుండుట హస్తమందుఁ
గ్రమముగ నతండు కరసహస్రంబుఁ జాఁచి. 2355

గీ. తుదకు విఫలప్రయత్నుఁడై తోయజాక్షి, వలదు,నా కింక నేమియుఁ గలిగెఁ దృప్తి
సీతచేఁ గాదు రామునిచేతఁ గాదు, తర్పితుఁడ నైతి నీచేతఁ దథ్యముగను. 2356

గీ. అని వచించుటయును శంభుఁ డతనిఁ జూచి
యింతకును దృప్తి గలిగెనె యెఱుఁగఁ జెపుమ
అతివ యొకతయ కాదు సీతమయు నేను
రాముఁడును నిచ్చినట్టివారలము చూవె. 2357

క. అని యడుగుటయును ద్విజుఁ డి, ట్లనియెను దృప్తుండ నైతి నధికంబుగ నా
కొనగూడి యీ పదార్థము, పెనుబూతమువోలె విడిచిపెట్టదు నన్నున్. 2358

చ. అనయము భోజనంబుకొఱ కయ్యెను నాకరజాల మెల్ల నే
నొనరుప వీలులేదు మఱియొక్కక్రియన్ బని లేనిపాటు గాఁ
గను నిట కేఁగుదెంచి యొకకర్మ మిటుల్ గొని తెచ్చుకొంటి నా
మనమున నెట్లు తోఁచినదొ మానక యట్టులె యయ్యె నంతయున్. 2359

క. అవుఁ గాక యేమి చేయఁగ, నవు నిప్పుడు మీఁదికర్జ మతిశీఘ్రముగన్
సవరింపుఁడు భుక్తాయా, సవశుఁడ నై నేను నిలువఁజాలక యుంటిన్. 2360

వ. అని పలికి చేతులలోనిపదార్థంబు మేనంతయుం బట్టించి రుద్దుకొనుచుండ
రామచంద్రుండు బ్రాహ్మణులకు నుత్తరాపోశనం బొసంగె. 2361

గీ. అంత నాపోశనజలంబు నారగించి, యవల నుచ్ఛిష్టపాత్రములందు నర్హ
విధిని గండూష మొనరించి విప్రు లెల్ల, లేచి పోయిరి యతిథి తా లేవఁడయ్యె.

సీ. అది చూచి రాముఁ డిట్లనియెను స్వామి లే, వక యుంటి వేమి కావలెనొ నీకు
సెలవిమ్ము నావుడు క్షితిసురవర్యుఁడు రామ, యేమియు వలదు సంతృప్తి యయ్యె

నీవు పెట్టినభుక్తి యెక్కువ యగుటను, లేవఁదీయక యున్న లేవఁ జాల
ననుటయు రాఘవుం డతనిచేతులు చిక్కఁ, బట్టి లేపఁగ లేక యట్టె నిలిచె
గీ. నంతటను వాయునందనుం డరుగుదెంచి, లేవ నెత్తంగ యత్నించి లేవ కునికి
వాలమును జుట్టి లాగంగ వసుధ యెల్ల, వణఁకుచున్నను విప్రుఁడు తొణఁకఁడయ్యె.
గీ. అంతటను బాదముల ధాత్రి నణఁగఁ ద్రొక్కి, పండ్లు బిగఁ బట్టి లాగె నాపవనసూతి
తోఁక బలిమిని బీఠంబుతోడఁ గూడఁ, గదలి వెలుపలఁ బడియె నాత్మాసురుండు.
ఆ. అపుడు జాంబవంతుఁ డతనిఁ బీఠంబునఁ, గూరుచుండఁ బెట్టి నీరు వోయ
నోడలు గడిగి సీతయును లక్ష్మణుండును, నాచమింపఁ జేసి రధికభక్తి. 2365
ఆ. అంత నాచమించి యాతఁడు లేవంగఁ, జాల కునికి నెఱిఁగి జాంబవంతుఁ
డతనిఁ దనభుజంబులం దుంచుకొని పోయి, దించెఁ దివిరి శ్రాద్ధదేశమందు.
వ. అంతట రామచంద్రుండు బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణంబు గావించి తదాశీర్వా
దంబులం బడసి భుక్తాయాసంబు నొందు చుండునతిథిసన్నిధికి సతీభ్రాతృసహి
తంబుగాఁ జేరి. 2367

—: హరిహరాదులు రామచంద్రాదులకుఁ బ్రత్యక్షమగుట :—

సీ. సీతను దత్పాదసేవకై నియమించి, యాచరించుచు నుండ నామె యట్లు
ముడువఁ దనూర్ధ్వజంబుల లక్ష్మణున కాజ్ఞ, చేసి యాతం డట్లు చేయుచుండ
వీవన నతనికి విసరంగ భరతు నా, జ్ఞాపించి యతఁ డట్లు సలుపుచుండ
సెలవిచ్చి తుడువఁ దచ్ఛ్లేష్మంబు శత్రుఘ్ను, నకు నతం డట్లు యొనర్చుచుండఁ
గీ. దత్కరంబుల నొత్తుచుఁ దాను నిలువ
నప్పు డతిథి రాజీవదళాక్షుఁ డగుచు
శంభుఁ డీశ్వరుఁ డగుచుఁ దత్సతి మృడాని
యగుచు నిలిచిరి యెదుట నత్యద్భుతముగ.
గీ. అంత రాముఁడు పులకాంకితాంగుఁ డగుచు
మ్రొక్కి సాష్టాంగముగ వారిముందు నిలిచె
నంత నిలిచిరి వందనం బాచరించి
తత్సతియుఁ దత్సహజులు నాతండువోలె. 2369
గీ. అప్పుడు ప్రసన్నులై హరిహరులు శివయుఁ, గరుణ వెలయంగ వారి నెల్లరనుగాంచి
కోరుకొనుఁ డిచ్చువారము కోరినట్లు, వరము లెన్నైనియును మీకు వాంఛ దీర.
క. అనుటయు రాముఁడు హర్షం, బెనయఁగఁ దత్పాదభక్తి యెపుడును మదిలోఁ
దనరారఁ గోరె వరమును, ననుజన్ములు సతియుఁ గోరి రట్టులె వెంటన్. 2371
క. అంతట నామువ్వురును ద, దంతర్ధానమున కేఁగ ప్రమోద మందుచును నిర
భ్యంతరముగ నిచ్చి వరం, బంతర్ధానంబు నొంది రతిశీఘ్రముగన్. 2372

గీ. అపుడు రాముఁడు బంధుమిత్త్రాదిసహితుఁ
డగుచు భుజియించి యవల దీనాంధకృపణ
జనులకు నొసంగి మృష్టాన్నమును సమస్త
జనులు గీర్తింప రాజ్యంబు చలుపఁ దొడఁగె. 2373

—: పాతాళఖండపఠనశ్రవణఫలకథనము :—

క. పాతాళఖండ మియ్యది, చేతోహరముగను దీనిఁ జెప్పెడివారల్
శ్రోతలును విగళితాఘుల, పాతకు లయి హరిపదంబుఁ బడయుదురు తుదిన్.

వ. అని చెప్పుటయును శౌనకాదిమహర్షిబృందం బమందానందభరితం బయ్యె.

క. సృష్టిస్థితిసంహార, స్రష్టీకృతనిజమహేశభావ సదాసం
తుష్టాంతరంగ భక్తా, భీష్టప్రద విశ్వనాథ యిష్టసనాథా. 2376

నారాచవృత్తము

నారాయణప్రియా శర
ద్ధారాధరాభవిగ్రహా
గౌరీసతీమనోహరా
వారాణసీపురాధిపా. 2277

గద్యము

శ్రీ చిదంబరకవీంద్రప్రణీతం బైన శ్రీమదాంధ్రపద్మపురాణంబునఁ
బాతాళఖండము
సమాప్తము.

---

శ్రీ కాశీవిశ్వేశ్వరార్పణమస్తు.



# శతావధాని, శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రికృతగ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీమదాంధ్రపద్మపురాణము | (ప్రథమసంపుటము) | క్యాలికో బైండు | 8–0–0 |
| | ,, ,, | ,, | అట్టబైండు | 7–0–0 |
| | ,, ,, | (ద్వితీయసంపుటము) | క్యాలికోబైండు | 4–0–0 |
| | ,, ,, | ,, | అట్టబైండు | 3–0–0 |
| | (ముందుగా ద్రవ్యమిచ్చినవారికి) నాలుగుసంపుటములు | | | 25–0–0 |
| 2. | హైమవతీ విలాసము (ప్రబంధము) | | | 0–8–0 |
| 3. | కపోత కిరాతము ,, | | | 0–6–0 |
| 4. | శ్రీరామాంజనేయము (నాటకము) | | | 0–12–0 |
| 5. | శ్రీకృష్ణసందేశము ,, | | | 0–12–0 |
| 6. | భారతీయ ప్రబోధము (నేటిపరిస్థితుల విమర్శించుపద్యకావ్యము) | | | 0–4–0 |
| 7. | పీఠికాపుర శతావధానము | | | 0–4–0 |
| 8. | నవాబు పేట శతావధానము | | | 0–4–0 |
| 9. | బెజవాడ శతావధానము | | | 0–4–0 |
| 10 | రాజసభావిహారము (అచ్చు కానున్నది) | | | |
| 11. | పంచాయతన పంచశతి (సంస్కృతము) | | | 0–12–0 |
| 12. | రాజధర్మకావ్యము ,, (అచ్చుకానున్నది) విద్వాన్, పి. విశ్వేశ్వరశాస్త్రికృతజయవ్యాఖ్యాసమలంకృతము | | | |
| 13. | శ్రీరత్నపాంచాలిక (శ్రీసర్వజ్ఞసింగభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి) విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతము | | | 1–8–0 |
| 14. | ప్రద్యుమ్నాభ్యుదయము (శ్రీరవివర్మభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి) విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతము (అచ్చు కా నున్నది) | | | |
| 15. | దూతవాక్యము (భాసకృతి కాంధ్రీకృతి – అచ్చు కా నున్నది) విద్వాన్, పిసుపాటివిశ్వేశ్వరశాస్త్రి కృతము | | | |
| 16. | పాణినీయము - కావ్యవాఙ్మయము వ్యా. వి, ప్ర; ఉ. భా. ప్ర. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | | 1–8–0 |
| 17. | శంకరవిజయము (గద్యము) విద్వాన్, పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | | 0–12–0 |
| 18. | అవధానాదర్శము (సంస్కృతము) విద్వాన్ పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతవ్యాఖ్యాసంకలితము | | | 0–2–0 |
| 19. | మాయావిలాసము. (ప్రబంధము – అముద్రితము) విద్వాన్, పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | | |

ప్రాప్తిస్థానము

విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి.
ఆంధ్రాధ్యాపకుఁడు
వేంకటగిరిరాజకళాశాల
నెల్లూరు.